# మనవి

స్నాత్వా స చేల మధికార్తివశాత్ ప్రశాంతో
రంగే మహాసదసి రంగిసమక్షమేవ ।
మౌలౌ నిధాయ శఠకోప మహో మహత్త్వాం
సత్యాపయన్ తవ హి కశ్చన నిశ్చికాయ ॥

**(శ్రీరామానుజాతిమానుషస్తవమ్ -36)**

ఇది, తిరుమళ్లిశై అణ్ణావప్పంగార్ అనే సాంప్రదాయిక నామంతో ప్రసిద్ధులైన శ్రీవాధూల వీరరాఘవాచార్యస్వామివారిచే ప్రణీతమైన శ్రీరామానుజాతి మానుషస్తవంలోని శ్లోకం. ఇందులో ప్రస్తావింపబడిన ఐతిహ్యం గురుంపరాప్రభావమనే సంప్రదాయ చరిత్రగ్రంథంలో **"కణియనూర్ శిఱియాచ్చాన్ సచేలస్నానపూర్వకమాక ఆర్తియోడే ఉపసన్నరాయ్ దివ్యాజ్ఞైయిట్టు ఎమ్బెరుమానార్ తిరువడికళొழ்ழియ వేఱు తఞ్జమిల్లై" -ఎన్ఱరుళినార్"** అని తెలుపబడింది. భగవద్రామానుజుల శిష్యులలో కణియనూర్ శిఱియాచ్చాన్ ఒకరు. వారొకనాడు సచేలస్నానం చేసి, శ్రీరంగంలో ఆచార్యులందఱు కలసి ఉండే సభలోకి వచ్చి, శఠకోపాన్ని తమ తలపై ఉంచుకొని, "భగవద్రామానుజుల శ్రీచరణాలు తప్ప వేఱు రక్షకం లేదని'' శపథం చేశారు. (స్నానం చేసి తడిగుడ్డలతో ప్రమాణం చేయడం ఆచారం)

ఈ విధంగా భగవద్రామానుజుల జగదాచార్యత్వాన్ని పెరియపెరుమాళ్, అప్పన్ (శ్రీవేంకటేశ్వరుడు), పేరరుళాళన్, తిరునారాయణప్పెరుమాళ్, అழகర్, తిరుక్కుఱుఙ్గుడినమ్బివంటి పలు అర్చామూర్తులే కాక, నమ్మాళ్వార్, శ్రీమన్నాథములు, ఆళవందార్‌వంటి పలువురు పూర్వాచార్యులు, కూరేశులు, ముదలియాణ్డాన్, వడుగనంబి, ఎమ్బార్, మిళకాళ్వాన్ వంటి సమకాలీనులైన ఆచార్యులు, పిళ్ళాన్, భట్టర్, నంజీయర్, నంబిళ్ళైవంటి తదనంతరకాలంలోని ఎందరో ఆచార్యులు సుస్పష్టంగా వ్యక్తం చేశారు. (ఈ వివరాన్ని గురుపరంపరా ప్రభావ గ్రంథంలో గమనించవచ్చు) ఈవిషయంగా పలువురు పూర్వాచార్యులు చరమోపాయనిర్ణయం, చరమగురునిర్ణయం, అంతిమోపాయనిష్ఠ వంటి పలు

గ్రంథాలను రచించారు. ఆ రీతిలోని కృతులలో ఒకటి -ప్రస్తుతం ప్రచురింప బడే **"చరమోపాయ తాత్పర్యమ్"**. దీనిని రచించినవారు సుమనఃకోలేశులనే పేరును కల నాలూర్ పిళ్ళై కుమారులైన నాలూరాచ్చాన్‌పిళ్ళై. వీరు, శ్రీమణవాళ మహామునులకు పరమాచార్యులు, తిరువాయ్‌మొళ్ళిప్పిళ్ళైకు ఆచార్యులు. ముందుగా నాలూరాచ్చాన్‌పిళ్ళై పితృపాదులైన నాలూర్‌పిళ్ళైను గూర్చి సంగ్రహంగా నివేదింపబడుతున్నది.

## నాలూర్‌పిళ్ళై వైభవసంగ్రహమ్ :-

తిరువాయ్‌మొళ్ళి ప్రబంధంలోని దివ్యార్థాలను తమ వాగ్వర్షంతో లోకంలో ముంచెత్తిన కారుణ్యపూర్ణులు, నమ్పిళ్ళై. వీరి ప్రధాన శిష్యులలో ఒకరైన వడక్కుత్తిరువీధిప్పిళ్ళై (శ్రీకృష్ణపాదులు) నమ్పిళ్ళై ఉపన్యాసాన్ని గ్రంథస్థం చేశారు. ముప్పై ఆఱువేల గ్రంథపరిమితిని కల ఈగ్రంథానికి (గ్రంథమంటే ముప్పై ఆఱు అక్షరాల పరిమితి. దీనికే **"పడి"** అనికూడా పేరు) ఈడు అనే ఈ పేరు వచ్చింది. తిరువాయ్‌మొళ్ళికి ప్రబంధానికి సాటివచ్చే వ్యాఖ్యానం కనుక దీనికి ఈడు అనేపేరు వచ్చిందని పెద్దలంటారు. ఈ ఈడు వ్యాఖ్యాన గ్రంథాన్ని నమ్పిళ్ళై తమ శిష్యులైన శిఱియాళ్వాన్‌ప్పిళ్ళై అనే ఈయుణ్ణి మాధవప్పెరుమాళ్- అనే ఆచార్యులకిచ్చి దానిని కాపాడమని అన్నారు. మాధవప్పెరుమాళ్ ఆ వ్యాఖ్యాన గ్రంథాన్ని రక్షించి, దానిని తమ కుమారులైన ఈయుణ్ణి పద్మనాభు లకు ఇచ్చి, **"ఓరాణ్‌వళ్ళి"**గా ఉపదేశించి కాపాడమన్నారు. పద్మనాభులు ఆరీతిలోనే ఆ వ్యాఖ్యానాన్ని తమ తిరువారాధన గృహంలో ఉంచి, నిధినివలె రక్షించారు.

వీరి శిష్యులు నాలూర్ ప్పిళ్ళై. **"నాలూర్"** అనేది వీరి వంశనామం. ఈ నాలూర్‌ప్పిళ్ళైకు కోలవరాహప్పెరుమాళ్ అని కూడా పేరు. **"చతుర్గ్రామకులో ద్భూతం ద్రావిడబ్రహ్మవేదినమ్, యజ్ఞార్యవంశతిలకం శ్రీవరాహమహం భజే"** (నాలూరాన్ వంశంలో అవతరించినవారు, శ్రీరామానుజుల శిష్యులలో ఒకరైన **"ఎచ్చాన్"** అనబడే యజ్ఞేశుల కులంలో తిలకం వంటివారు, ద్రావిడవేదార్థాన్ని తెలిసినవారైన శ్రీకోలవరాహప్పెరుమాళ్ అనే నాలూర్‌ప్పిళ్ళైను ఆశ్రయిస్తున్నాను) అనే (పిళ్ళైలోకమ్‌జీయర్ భగవద్విషయ తనియన్ వాఖ్యానంలో ఉట్టంకించిన)



వీరి తనియన్ శ్లోకాన్నిబట్టి వీరి వంశవివరాలు కొన్ని తెలుస్తున్నవి. వీరు అవతరించిన స్థలం తొండమండలంలోని మేల్‌పాడగమ్. వీరిది కాశ్యపగోత్రం. వీరికి రామానుజులనే పేరుకూడా ఉన్నది.

నాలూర్‌పిళ్ళై ఈయుణ్ణిపద్మనాభ ప్పెరుమాళ్‌ను ప్రణిపాతనమస్కార ప్రియవచనాలతో ఆనందింపజేయగా, పద్మనాభప్పెరుమాళ్ ఈడు వ్యాఖ్యానాన్ని నాలూర్‌ప్పిళ్ళైకు **"ఓరాణ్‌వళ్ళి"**గా అనుగ్రహించదలచారు. నాలూర్‌ప్పిళ్ళైను వరదరాజస్వామి సన్నిధికి తీసికొనిపోయి "ఓరాణ్‌వళ్ళిగా ఈడును రక్షిస్తానని మాట ఇవ్వాలి'' అని శఠకోపాన్ని నాలూర్‌ప్పిళ్ళై శిరస్సుపై అర్చకులద్వారా పెట్టించారు. అపుడు నాలూర్‌ప్పిళ్ళై తమ శిరస్సుపై పెట్టిన శఠకోపాన్ని అదిమిపట్టి వరదరాజస్వామి వైపు చూస్తూ సాభిప్రాయంగా సంజ్ఞ చేయగా, వీరి హృదయాన్ని గమనించిన వరదరాజస్వామి "మీరు ఈ వ్యాఖ్యను అందఱికి అనుగ్ర హించండి'' అని అర్చకులద్వారా నాలూర్‌పిళ్ళైకు ఆదేశించారు. అప్పటినుండి ఈడు **"ఓరాణ్ వళ్ళి"**గా కాకుండా ఆశకల్గిన వారందఱికి అందే అవకాశం కల్గింది. **"చతుర్గ్రామోద్భవం శ్రీమద్రామావరజకింకరమ్, సర్వదా ద్వయసన్నిష్ఠం కోలాహ్వాయమహం భజే"** , **"శ్రీమద్రామానుజదాసపాదయుగ్మముపాస్మహే, శఠకోపార్యవాణీనా మర్థతాత్పర్యసిద్ధయే"** అనే వీరి తనియన్ శ్లోకాలవల్ల ఈ విషయాలను తెలియవచ్చు. పెరియాళ్వార్ తిరుమొళ్ళి, పెరియతిరుమొళ్ళి మొదలైనవానికి ప్రతిపదార్థరూపవ్యాఖ్యానాన్ని నాలూరాచ్చాన్‌పిళ్ళై రచించారు. **"యః పద్మనాభగురుతః శఠజిన్మునీంద్ర శ్రీసూక్తిభాష్య మధిగమ్య సమృద్ధ బోధమ్, తద్దేవరాజగురవేఽ దిశ చ్చతుష్పూర్వ్యాసేద్ధ కోల వరదేశికమాశ్రయే తమ్"** (భగవద్విషయ తనియన్ వ్యాఖ్య) అనే నాలూర్‌పిళ్ళై తనియన్ వారి వైభవాన్ని సంగ్రహంగా తెల్పుతున్నది.

నాలూర్‌పిళ్ళైకుగల సమయస్ఫూర్తి, జ్ఞానవైరాగ్యం, వివేచనాశక్తి వ్యక్తమయే ఐతిహ్యాలు కొన్ని దివ్యప్రబంధవ్యాఖ్యానాలలో వ్యక్తమవుతున్నాయి. నాలాయిరదివ్యప్రబంధాలకు వ్యాఖ్యానాలు పెరియవాచ్చాన్‌పిళ్ళై, అళ్ళకియ మణవాళచ్చీయర్ కాలానికే పూర్తిగా సంతరింపబడినపుడు, తదనంతర కాలానికి చెందిన నాలూర్‌పిళ్ళైకు సంబంధించిన ఐతిహ్యాల ప్రసక్తి వ్యాఖ్యానాలలో

ఏవిధంగా వస్తుంది? అనే సందేహం కలుగవచ్చు. నాలూర్‌పిళ్ళైకు, వారి కుమారులైన నాలూరాచ్చాన్ పిళ్ళైకు సంబంధించిన ఐతిహ్యాలు వారికి తరువాత అవతరించిన తిరువాయ్‌మొళ్ళిప్పిళ్ళై, శ్రీమణవాళమహామునులు రచించిన వ్యాఖ్యానాలలో ప్రస్తావింపబడడంలో ఏ అనౌచిత్యం లేదుకదా ?

సర్వేశ్వరుడైన శ్రియఃపతి వామనావతారాన్ని ఎత్తి మహాబలివద్దకు పోయి మూడడుగుల భూమిని యాచించినపుడు, ఆ దానాన్ని ఇవ్వవద్దని బలి అడ్డుకొన్నాడు. అపుడు శుక్రుని కంటికి వామనమూర్తి దర్భమొనతో గుచ్చిన వృత్తాంతాన్ని పెరియాళ్వార్ తిరుమొళ్ళిలో పెరియాళ్వార్లు **"దానమ్ విలక్కియ శుక్కిరన్ కణ్ణై త్తురుమ్బాల్ కిళరియ శక్కరక్కైయన్"** అని అంటూ ప్రస్తుతించారు. ఇక్కడ ఈ సూక్తిని ఉద్దేశించి నాలూరాచ్చాన్‌పిళ్ళై అడిగిన సందేహాన్ని, దానికి నాలూర్‌పిళ్ళై ఇచ్చిన సమాధానాన్ని తిరువాయ్‌మొళ్ళిప్పిళ్ళై తమ వ్యాఖ్యానంలో ప్రస్తావించారు.

"చాలా గొప్ప యోగ్యతను కల వామనునకు కదా బలిచక్రవర్తి దానమిచ్చాడు. ఆ దానాన్ని కూడా వామనుడు అడిగిన రీతిలోనే ఇచ్చాడు. ఇటువంటి సత్కార్యాన్ని చేసిన మహాబలి పాతాళంలో చెఱలో పెట్టబడ్డాడే! అదేవిధంగా, దానాన్ని అడిగిన వామనుడు వాస్తవానికి యాచకుడు కానేకాడు- అనే నిజాన్ని పల్కిన శుక్రునకు నేత్రం నష్టమైనది. ఈ విధంగా దానాన్ని ఇచ్చినవాడు తన రాజ్యాన్ని కోల్పోవడం, నిజం పల్కినవాడు కంటిని కోల్పోవడం న్యాయమా?'' - అని నాలూర్ ఆచ్చాన్‌పిళ్ళై ప్రశ్నించారు.

దీనికి నాలూర్‌పిళ్ళై ఇచ్చిన సమాధానం ఏమంటే- "ఈ ఇద్దఱి దగ్గర రెండు దోషాలున్నాయి. వాటివల్ల ఈ ఇద్దఱికి అనర్థం ప్రాప్తించింది. దానాన్ని ఇవ్వవద్దు - అని ఆచార్యుడైన శుక్రుడు ఎంతగా చెప్పినా, అడ్డుకొన్నా, బలి వినకుండా ఆచార్యోపదేశానికి విరుద్ధంగా వర్తించాడు. అందువల్ల మహాబలివద్ద దోషం- ఆచార్యుని మాటను ఉల్లంఘించడం. అందువల్లనే అతడు రాజ్య భ్రష్టుడయ్యాడు. ఇక శుక్రుడు పల్కినది యథార్థమే అయినా, ఒకడు ఇంకొకనికి దానం ఇచ్చేటపుడు ఆ దానాన్ని అడ్డుకోవడం మహాపాపం. అందువల్లనే శుక్రుడు కంటిని కోల్పోయాడు''- అని నాలూర్‌పిళ్ళై సమాధానం పలికారు.



ఈ విధంగానే నాలూర్‌పిళ్ళై పల్కిన ఒక వార్తను తిరువాయ్‌మొళ్ళిప్పిళ్ళై పెరియాళ్వార్ తిరుమొళ్ళి వ్యాఖ్యానంలో ప్రస్తావించారు. **"కాప్పై పూణుమ్ కణ్ణాడి కాణుమ్ తన్‌కైయిల్ వళై కులుక్కుమ్ కూఱై ఉడుక్కుమ్.."** (3-7-8) అనే సూక్తి భగవానుని రాకకోసం ఎదురుతెన్నులు చూసే నాయకి తనను అలంకరించుకొనే రీతులను గూర్చి తల్లి పలికేటట్లుగా ఉన్నది. ఈ సూక్తిని ఉద్దేశించి నాలూర్‌పిళ్ళై పల్కిన వార్త ఇది.

"నాయకి తనను ఈ విధంగా పలు రీతులలో అలంకరించుకొన్నప్పటికీ, నాయకుడైన సర్వేశ్వరుడు రాకపోతే ఈ అలంకారాలన్ని ఏమవుతాయి?''- అనే ప్రశ్నకు "ఈమె తన వివాహం కోసం చేసికొనే ఈ అలంకారం అతడు రాకపోతే శవానికి చేసిన అలంకారంవలె వ్యర్థమే కాగలదు'' అనేది నాలూర్‌పిళ్ళై పల్కిన వార్త. దీనిని వారి కుమారులు నాలూరాచ్చాన్‌పిళ్ళై తెల్పినట్లుగా తిరువాయ్‌మొళ్ళిప్పిళ్ళై తెలిపారు.

ఈ సూక్తి వ్యాఖ్యానంలోనే నాలూర్‌పిళ్ళై పల్కిన వేరొక వార్త (తిరువాయ్‌మొళ్ళిప్పిళ్ళై వ్యాఖ్యానంలో) ఉదాహరింపబడింది. భగవానుని రాకకోసం నాయకి తనను అలంకరించుకొనే రీతిని ఆమె తల్లి వివరిస్తూ **"కాప్పై పూణుమ్ కణ్ణాడి కాణుమ్ తన్ కొవ్వై శెవ్వాయ్ తిరుత్తుమ్"**- ఆభరణాలను అలంకరించుకొంటున్నది, అద్దాన్ని చూస్తున్నది, తన అధరాలను అలంకరించుకొంటున్నది - అని అన్నది. ఇక్కడ ఈ సూక్తిని రస్యంగా వివరిస్తూ నాలూర్‌పిళ్ళై పల్కిన వివరణను తిరువాయ్‌మొళ్ళి ప్పిళ్ళై ప్రస్తావించారు. **"ఇవళ్ తాన్ అముదుపడి తిరుత్తువదు, శాత్తుప్పడి తిరుత్తువదాకానిన్రాళ్"** అనేది నాలూర్‌పిళ్ళై పల్కిన సూక్తి. దీని భావమేమంటే - భగవానునకు ఈమె అధరాలే రస్యభోజనంగా, ఈమె ఒడలే చందనంగా అయినందున, వాటిని అలంకరించుకొంటున్నది- అని.

ఈ వివరణంద్వారా నాలూర్‌పిళ్ళైకు గల చమత్కారోక్తి చతురత వ్యక్తమవుతున్నది. ఇంతవరకు ప్రస్తావించిన మూడు సందర్భాలు తమ పరమాచార్యులైన నాలూర్‌పిళ్ళై పట్ల తిరువాయ్‌మొళ్ళిప్పిళ్ళైకు గల గౌరవాతిశయం వ్యక్తం చేస్తున్నవి. ఇక, శ్రీమణవాళమహామునులకు వీరిపట్ల గల గౌరవాన్ని

వ్యక్తం చేసే ఒక సందర్భం ఉదాహరింపబడుతున్నది. ఇది, మణవాళ మహామునులు పెరియాళ్వార్ తిరుమొళ్ళిలోని **"మాఱ్ఱుత్తాయ్"** (3-9-4) ఇత్యాది పాశురానికి అనుగ్రహించిన వ్యాఖ్యానంలో ఉన్నది.

ఈ పాశురంలోని **"మాఱ్ఱు త్తాయ్, ఈఱ్ఱు త్తాయ్, "కూఱ్ఱు త్తాయ్"** అనే మూడు పదాలకు నాలూర్‌పిళ్ళై, తిరువాయ్‌మొళ్ళిప్పిళ్ళై- అనే ఇద్దఱు పూర్వాచార్యులు చేసిన వివరణాలను ప్రస్తావించేటపుడు, ముందుగా నాలూర్‌పిళ్ళై వివరణానికి ప్రాథమ్యాన్ని ఇవ్వడం గమనించవచ్చు. నాలూర్‌పిళ్ళై వివరణంలో- **మాఱ్ఱు త్తాయ్-** సుమిత్ర, **ఈఱ్ఱు త్తాయ్** - కౌసల్య, **కూఱ్ఱు త్తాయ్-** కైకేయి. ఇక, తిరువాయ్‌మొళ్ళిప్పిళ్ళై వివరణంలో - **మాఱ్ఱు త్తాయ్** - కైకేయి, **ఈఱ్ఱు త్తాయ్-** కౌసల్య, **కూఱ్ఱు త్తాయ్-** సుమిత్ర.

ఈ రెండు యోజనలో, తమకు సాక్షాత్తు ఆచార్యులైన తిరువాయ్ మొళ్ళిప్పిళ్ళై చేసిన వివరణం కంటే, నాలూర్‌పిళ్ళై వివరణాన్ని ముందుగా ప్రస్తావించడంలోని కారణాలను మణవాళమహామునులే స్వయంగా తమ వ్యాఖ్యలో తెలిపారు. అందులో మొదటి కారణం- పెరియాళ్వార్ల ప్రకృతసూక్తికి ముందు వెనుకలలో పల్కిన సూక్తులకు నాలూర్‌పిళ్ళై చేసిన వివరణం పొసగి ఉండడం (విస్మృతిభీతిచే దీని వివరం తెలుపబడలేదు). రెండవ కారణం- గురుపరంలో నాలూర్‌పిళ్ళై తిరువాయ్‌మొళ్ళిప్పిళ్ళైకు పరమాచార్యులై ఉండడం. ఈ కారణాన్ని శ్రీవరవరమునులు స్పష్టంగా- **"సంబంధత్తాలుమ్ వన్దాల్, నమ్బిళ్ళై శ్రీపాదత్తిలే కేట్ట శిఱియాళ్వానప్పిళ్ళై కుమారర్ పక్కలిలే కేట్టనాలూర్‌పిళ్ళై అరుళిచ్చెయ్‌దదాకైయాలే వన్ద ప్రాబల్యముణ్డు. అవర్‌తామ్ అచ్చాన్‌పిళ్ళై తిరుత్తకప్పనారాకైయాలే పిళ్ళైక్కు పరమాచార్యరుమితే. ఆకైయాల్ అన్ద యోజనై ముఱ్పడ ఎళుది, పిళ్ళై యరుళిచ్చెయ్‌ద యోజనై పిఱ్పడ ఎళుదప్పట్టదు"** (సంబంధాన్ని చూస్తే కూడా, నమ్బిళ్ళై సన్నిధిలో విన్న శిఱియాళ్వాన్ పిళ్ళై అనే ఈయుణ్ణి మాధవప్పెరుమాళ్ కుమారులైన పద్మనాభప్పెరుమాళ్ వద్ద ఆలకించిన నాలూర్‌పిళ్ళై పల్కినది కనుక వారి యోజనకు ప్రాబల్యమున్నది. నాలూర్‌పిళ్ళై, నాలూరాచ్చాన్ పిళ్ళైకు పితృపాదులు కనుక, తిరువాయ్‌మొళ్ళిప్పిళ్ళైకు పరమాచార్యులు కదా. అందువల్ల వారి



యోజనను ముందుగా వ్రాయబడినది. తిరువాయ్‌మొళ్ళిప్పిళ్ళై యోజన తరువాత వ్రాయబడినది) అని అన్నారు.

## నాలూర్‌ఆచ్చాన్‌పిళ్ళై వైభవసంగ్రహం

నాలూర్‌ప్పిళ్ళై కుమారులు దేవాధిపులనే నాలూరాచ్చాన్‌పిళ్ళై. నాలూర్‌ప్పిళ్ళై, ఈడును విశ్వవ్యాప్తం చేయాలనే తమ ఆశయాన్ని వరదరాజస్వామి అనుగ్రహించినందున ఆ ఉపకారస్మృతిగా తమ కుమారునకు దేవాధిపులనే పేరును పెట్టారు. "నల్లమకన్" అనే రీతిలో తండ్రికి విధేయులై నాలూరాచ్చాన్‌పిళ్ళై వర్ధిల్లారు. **"నమోఽస్తు దేవరాజాయ చతుర్గ్రామనివాసినే, రామానుజార్య దాసస్య సుతాయ గుణశాలినే"** అనేది వీరి తనియన్ శ్లోకం. **"ధనుర్జ్యేష్ఠాసముద్భూతం యతిరాజాంఘ్రి సంశ్రితమ్, వేదాంతద్వయతత్త్వజ్ఞం దేవరాజగురుం భజే"** అనే వీరి తిరునక్షత్ర తనియన్‌వల్ల ధనుర్మాసంలోని జ్యేష్ఠానక్షత్రంలో వీరు అవతరించినట్లు తెలుస్తుంది.

నాలూర్‌ప్పిళ్ళై, యోగ్యులైన తమకుమారులు నాలూరాచ్చాన్‌పిళ్ళైకు ఈడును ఉపదేశించి, దీనిని వర్ధిల్లజేయండి - అని ఆజ్ఞాపించారు. **"సుతం కోలవరాహస్య కురుకాధీశపూర్వజమ్, శాంతం సద్వృత్తనిరతం దేవరాజ మహం భజే"** (భగవద్విషయ తనియన్ వాఖ్య) అనే వీరి ప్రార్థనాశ్లోకాన్నిబట్టి వీరికి కురుకాధీశులనే సోదరులున్నట్లు తెలుస్తున్నది.

నాలూరాచ్చాన్‌పిళ్ళై ఈడు వ్యాఖ్యానాన్ని తిరునారాయణపురత్తు ఆయ్, తిరువాయ్‌మొళ్ళిప్పిళ్ళై, ఇళమ్ పిళిశైప్పిళ్ళై (ఆళ్వార్) మొదలైనవారికి తిరునారాయణపురంలో అనుగ్రహించారు. ఇందువల్ల వీరు కొంతకాలం ఆ దివ్యదేశంలో వాసం చేసినట్లు తెలుస్తున్నది. **"శ్రీశైలనాథ గురుమాతృ గురూత్తమాభ్యాం శ్రీసూక్తిదేశికవరేణ చ యస్త్రి ధైవమ్, వ్యక్తః శఠారి కృతిభాష్య సుసంప్రదాయో విస్తారమేతి సహ వైష్ణవపుంగవేషు"** (నాలూరాచ్చాన్‌పిళ్ళై-తిరువాయ్‌మొళ్ళిప్పిళ్ళై, తిరునారాయణ పురత్తు ఆయ్, శఠజిత్ సూక్తి దేశికులనే ముగ్గురు ఆచార్యుల ద్వారా తిరువాయ్‌మొళ్ళి ఈడువ్యాఖ్యానాన్ని వైష్ణవలోకంలో ప్రచారం చేశారు) అనే భగవద్విషయ తనియన్ వ్యాఖ్యలో శ్రీపిళ్ళైలోకమ్ జీయర్

ప్రస్తావించిన శ్లోకం స్మరణీయం తిరువాయ్‌మొఴిప్పిళ్ళైక్కు తిరువాయ్‌మొఴి ఈడు వ్యాఖ్యానాన్ని మిగిలిన మూడు ఆయిరాలకు అర్థాన్ని అనుగ్రహించిన విషయాన్ని శ్రీమణవాళమహామునులు **"మాఱ్ఱుత్తాయ్"** (3-9-4) అనే పెరియాఴ్వార్ తిరుమొఴి పాశుర వ్యాఖ్యానంలో ప్రస్తావించారు. (ఇది ఇతః పూర్వమే తెలుపబడింది) ఈ విధంగా పెరియజీయర్‌కు పరమాచార్యులు- నాలూరాచ్చాన్‌పిళ్ళై.

నాలూరాచ్చాన్‌పిళ్ళై తిరువాయ్ మొఴిప్పిళ్ళై మొదలైన ముగ్గురికి ఈడు ప్రసాదించిన వివరం యతీంద్ర ప్రవణ ప్రభావంలో ఈవిధంగా తెలుపబడింది.

తిరుమలైయాఴ్వార్ (తిరువాయ్‌మొఴిప్పిళ్ళై) తిరుక్కణ్ణఙ్గుడిప్పిళ్ళై సన్నిధికి పోయి "దాసునకు తిరువాయ్‌మొఴికి అర్థాన్ని తెలియజేయాలి'' అని అనగా, వారు కూడా సమ్మతించి, ఆ రీతిలోనే ఆరంభించి తెలిపారు. తిరుక్కణ్ణఙ్గుడిప్పిళ్ళై తాత్పర్యార్థాలను మాత్రమే ప్రసాదించగా, తిరువాయ్ మొఴిప్పిళ్ళై శబ్దానికి తగినట్లుగా అర్థాన్ని అనుగ్రహించాలి - అని వారిని నిర్బంధిస్తూ అడిగారు. తిరుక్కణ్ణఙ్గుడిప్పిళ్ళై అపుడు "అయితే మీరు తిరుప్పుట్కుడి జీయర్ దగ్గరకు వెళ్ళండి'' అని అనగా, తిరుమలైయాఴ్వార్ ఆవిధంగానే అక్కడి వెళ్ళారు. అప్పటికి తిరుప్పుట్కుడి జీయర్ పరమపదించి పన్నెండు దినాలై ఆనాడు తిరునారాయణ బలి జరుగుతున్నది. దీనిని చూచి తిరుమలైయాఴ్వార్ చాలా దుఃఖించారు. ఆ సమయంలో అక్కడే ఉన్న నాలూరాచ్చాన్‌పిళ్ళై వీరిని చూచి, "మీరు వచ్చిన పని ఏమి ?'' అని ప్రశ్నించగా, తిరువాయ్‌మొఴిప్పిళ్ళై వారిని సేవించి, తాము వచ్చిన పనిని గూర్చి విన్నపించారు. "అయితే మేము మీకు తిరువాయ్‌మొఴి ఈడువ్యాఖ్యానాన్ని ఆరంభించి తెలుపుతాము'' అని పల్కి, తిరుమలైయాఴ్వార్‌ను స్వీకరించి, తిరువాయ్‌మొఴి ఈడు వ్యాఖ్యను ప్రసాదించారు.

ఈ విషయాన్ని తిరునారాయణపురత్తు ఆయ్, పిళ్ళై మొదలైనవారు విని, తిరునారాయణపురంలోని ఎమ్బెరుమానార్ ఆజ్ఞాపించిన లేఖగా వ్రాసి, రామానుజదివ్యాజ్ఞగా అక్కడికి వేంచేయమని తెలుపుతూ, ఆ లేఖను నాలూరాచ్చాన్ పిళ్ళై వద్దకు పంపించారు. దానిని చూచి నాలూరాచ్చాన్‌పిళ్ళై



**"ఉచ్చిమేల్ వైత్తుక్కొణ్డుకన్దవళ్"** (శిరస్సుపై పెట్టుకొని ఆనందించింది) అనే రీతిలో శ్రీముఖాన్ని శిరసావహించి తిరుమలైయాఴ్వార్‌తో పాటు తిరు నారాయణ పురానికి వేంచేశారు. ఆయ్ మొదలైనవారందరు దానిని విని చాలా ఆనందంతో నాలూరాచ్చాన్ పిళ్ళైకు ఎదురేగి, వారి పాదాలపై పడిసేవించి, తీసికొనిపోయి, **"ఆరుహ్యామల యాదవాద్రిశిఖరం కల్యాణ తీర్థే తతః స్నాత్వా లక్ష్మణయోగినః పదం యుగం నత్వా తు గత్వా తతః.... సంపత్కుమారం హరిమ్"** (నిర్మలమైన యాదవాద్రి శిఖరాన్ని ఎక్కి, తరువాత కల్యాణతీర్థంలో స్నానమాడి, శ్రీరామానుజుల శ్రీచరణాలను నమస్కరించి, పిదప తిరునారాయణస్వామిని సేవించి, అక్కడ భూమీదేవిని, లక్ష్మీదేవిని, వీరి మధ్యలో వేంచేసి ఉండే సంపత్కుమారులనే హరిని సేవిస్తే అంతకంటే వేఱు తపఃఫలం ఏమున్నది?) అనే రీతిలో క్రమంగా గొప్ప ప్రీతితో వెళ్ళి, తిరునారాయణ స్వామి శ్రీచరణాలనే శరణంగా భావించి, అక్కడ ఆనందంగా వేంచేసి ఉండే భగవద్రామానుజులను సేవించి, వారి పురుషకారంతో యదుగిరి నాచ్చియార్‌ను, శెల్వపిళ్ళైను, తిరునారాయణులను సేవించారు. తరువాత శ్రీరామానుజులకు ఆనందం కలిగేటట్లు **"కేట్టారార్ వానవర్‌కళ్ శెవిక్కినియ శెఞ్జొల్"** అయిన తిరువాయ్‌మొఴిని ఆరంభించి ఈడు ముప్పత్తాఱాయిరవ్యాఖ్యను, అతృప్తామృత రూపమైన దాని శబ్దస్వారస్యం, అర్థస్వారస్యం, ధ్వని, వ్యంగ్యం, భావార్థం, స్వాపదేశం, అన్యాపదేశం - అంతా ఏ సంశయం, విపర్యయం లేకుండా చక్కగా తెలిసేటట్లు **"మేలోర్‌క్కు ఈన్దార్ అవరేమిక్కు"** అనే రీతిలో నాలూరాచ్చాన్‌పిళ్ళై తమ పరమకృపతో ప్రసాదించగా, పిళ్ళై మొదలైనవారు విన్నారు... తిరువాయ్‌మొఴికి ఈడు ముప్పత్తాఱాయిరవ్యాఖ్యను అనుగ్రహించి పూర్తి చేసిన తరువాత నాలూరాచ్చాన్ పిళ్ళై తిరుమలై యాఴ్వార్‌తో పాటు స్వస్థానానికి వేంచేశారు.

ఈ వృత్తాంతం ప్రపన్నామృతమనే సంప్రదాయ చరిత్రగ్రంథంలోని ఈ క్రింది శ్లోకాలద్వారా తెలుస్తున్నది.

**విలలాప భృశం తేన శ్రీశైలేశ స్సుదుఃఖితః, విలాపకారణం జ్ఞాత్వా తస్య దేవాధిప స్తదా, శ్రీశైలేశగుణై స్తుష్టః చతుర్గ్రామాధిపో గురుః, సత్పుత్ర ఇతి**

నామాస్య ప్రదదౌ ప్రేమపూర్వకమ్, దేవరాజాదిగురుభిః యాదవాచలవాసిభిః, భగవద్విషయార్థాయ నితరాం ప్రార్థిత స్తదా, దేవాధిపః సమాహూతః శ్రీశైలేశ సమన్వితః, యాదవాచల మాసాద్య యతిరాజస్య సన్నిధౌ, కృష్ణపాదకృతం భాష్యం ప్రదదౌ ప్రేమపూర్వకమ్".

తిరువాయ్‌మొఴ్రిప్పిళ్ళై తమ పెరియాళ్వార్ తిరుమొఴ్రి వ్యాఖ్యానంలో పలుచోట్ల తమ ఆచార్యులు నాలూరాచ్చాన్‌పిళ్ళై ద్వారా అందిన పరంపరా గతమైన యోజనలను ప్రస్తావించి, వారి పట్ల తమకు గల గౌరవాన్ని చాటారు.

కాళియుడనే విషసర్పంయొక్క విషంవల్ల కాళిందీహ్రదంలోని నీరు విషమయమై, ఆ నీటిని తాగిన పశుపక్ష్యాదులు మరణించడం శ్రీకృష్ణుడు గమనించాడు. ఆ నదీతీరంలో గల కదంబవృక్షాన్ని ఎక్కి, దానిపై నుండి కాళిందీహ్రదంలోకి దూకి, కాళియుని తలలపైకి ఎక్కి నాట్యం చేశాడు. ఈ సందర్భాన్ని పెరియాళ్వార్లు తమ ప్రబంధంలో **"కాయు నీర్ పుక్కు క్కడమ్బేఱి కాళియన్ తీయ పణత్తిల్ శిలమ్బార్‌క్క ప్పాయ్‌న్దు ఆడి"** (2-1-2) అని స్తుతించారు. ఈ సూక్తిని ఉద్దేశించి నంజీయర్ అడిగిన ప్రశ్నను, దానికి భట్టర్ పల్కిన సమాధానాన్ని నమ్బిళ్ళై చేసిన ఇంకొక వివరణాన్ని నాలూరాచ్చాన్‌పిళ్ళై తమకు తెలుపగా తిరువాయ్‌మొఴ్రిప్పిళ్ళై దానిని ప్రస్తావించారు.

"కాళియుని విషం వల్ల మడుగులోని నీరు కాగి, ఆ మడుగుతీరంలో ఉండే కడిమిచెట్టు మాడిపోయి ఉంటాయి కదా! ఆ చెట్టుపైకి శ్రీకృష్ణుడు ఏవిధంగా ఎక్కగలిగాడు?'' అని నంజీయర్ తమ ఆచార్యులైన భట్టర్‌ను ప్రశ్నించగా, భట్టర్- "కడిమిచెట్టుపైకి ఎక్కడానికి ముందు శ్రీకృష్ణుడు దానిని తన చల్లని చూపుతో ఒకసారి చూచి ఉంటాడు. ఆ కటాక్షం పడగానే ఆ చెట్టు చిగిర్చి నవనవోన్మేషంగా ప్రకాశించింది'' అని బదులిచ్చారట. ఇదే సందేహానికి నమ్బిళ్ళై ఇచ్చిన సమాధానాన్ని నాలూరాచ్చాన్‌పిళ్ళై తిరువాయ్‌మొఴ్రిప్పిళ్ళైకు తెలిపారు. అది ఏమంటే- "మహాభారతయుద్ధంలో చివర అశ్వత్థామ ప్రయోగించిన అస్త్రంవల్ల ఉత్తరాగర్భంలోని శిశువు మాడి మసిబొగ్గుగా మాఱి జన్మించగా, ఆ శిశువును శ్రీకృష్ణుడు తన పాదంతో స్పృశించి పునరుజ్జీవితుని చేశాడు. ఆ శ్రీచరణంతోనే కదా శ్రీకృష్ణుడు కడిమిచెట్టును ఎక్కాడు. ఆ శ్రీచరణం సోకగానే మాడిపోయిన కడిమిచెట్టు చిగిర్చి వికసించింది'' అనేది నమ్బిళ్ళై వివరణం. దీనిని నాలూరాచ్చాన్‌పిళ్ళై తిరువాయ్‌మొఴ్రిప్పిళ్ళైకు తెల్పినందున, పూర్వాచార్యుల యోజనల పట్ల నాలూరాచ్చాన్‌పిళ్ళైకు గల గౌరవం వ్యక్తమవుతున్నది.



ఇంకొక సందర్భంలో నాలూరాచ్చాన్‌పిళ్ళై పల్కిన వార్తను తిరువాయ్‌మొఴ్రిప్పిళ్ళై ఉదాహరించారు. భగవానుని **"ఆలత్తిలైయాన్ అరవినణైమేలాన్"** (2-6-6) (మఱ్ఱి చిగురుటాకుపై శయనించినవాడు, ఆదిశేషుని పడుకగా కలవాడు) అని పెరియాళ్వార్లు స్తుతించిన సూక్తిని తిరువాయ్‌మొఴ్రిప్పిళ్ళై వివరిస్తూ, నాలూరాచ్చాన్‌పిళ్ళై పల్కిన సూక్తిని స్మరింపజేశారు.

ప్రళయకాలంలో అన్ని వస్తువులను తన ఉదరంలో పెట్టుకొని, వటదళంపై శయనించిన వృత్తాంతాన్ని పొయ్‌కై ఆళ్వార్లు ప్రస్తుతిస్తూ- **"పాలన్ తనదురువాయ్ ఏழுలకుణ్డు ఆలిలైయిన్ మేలన్న్రు నీ వళర్‌న్ద మెయ్ ఎన్బర్, ఆలన్రు వేలైనీరుళ్ళదో? విణ్ణదో? మణ్ణదో? శోలైశూழ్ కున్రెడుత్తాయ్! శొల్లు"** (చిన్న శిశువురూపంలో నీవు సమస్తలోకాలను నీ ఉదరంలో పెట్టుకొని మఱ్ఱి చిగురుటాకుపై శయనించిన వృత్తాంతం వాస్తవమని విజ్ఞులు అంటారు. అయితే, ఆ చిగురుటాకు ప్రళయజలంలో ఉన్నదా? ఆకాశంలో ఉన్నదా? భూమిలో ఉన్నదా! స్వామీ! చెప్పు) అని సరసంగా ప్రశ్నించారు. ఈ సూక్తిని నాలూరాచ్చాన్ పిళ్ళై ప్రస్తావించి పెరియాళ్వార్ల శ్రీసూక్తిని వివరించారని తిరువాయ్‌మొఴ్రిప్పిళ్ళై తమ వ్యాఖ్యలో తెలిపారు. దీనినిబట్టి నాలూరాచ్చాన్‌పిళ్ళైకు గల ఆళ్వార్ల ప్రబంధాలలోని పరిపూర్ణమైన అవగాహన, అభినివేశం వ్యక్తమవుతున్నాయి.

పెరియాళ్వార్లు తమ ప్రబంధంలో **"పిచ్చై పుక్కాకిలుమ్ ఎమ్బిరాన్ తిరునామమే నచ్చుమిన్"** (బిచ్చమెత్తి జీవించినా భగవానుని తిరునామాలనే మీ బిడ్డలకు పెట్టండి) అని పల్కినసూక్తిని శ్రీమణవాళమహామునులు వివరిస్తూ తమ ఆచార్యులైన తిరువాయ్‌మొఴ్రిప్పిళ్ళై ద్వారా తమకు అందిన నాలూరాచ్చాన్‌పిళ్ళైకు చెందిన ఐతిహ్యాన్ని ప్రస్తావించారు.

ఒకడు తన కుమారునకు నామకరణం చేసేటపుడు అతనికి మంచి సంపదను ఇవ్వగల్గిన ఒక దేవత పేరును పెట్టాలి- అని భావించాడు. అపుడు

అక్కడకు వచ్చిన ఇంకొకడు "ధనాధిపతి అయిన కుబేరుని పేరును పెట్టవచ్చుకదా" అని అన్నాడు. ఆ మాటను విని అక్కడ ఉండే ఆస్తికుడొకడు సంపదకు ఆశపడి **"జలిబిలి అని పేరును పెట్టడం కంటే, బిచ్చమెత్తినా ఎత్తనీ,** అని **"నారాయణుడు"** అనే పేరును పెట్టడమే మంచిది సుమా !" అని అన్నాడట. ఈ ఐతిహ్యాన్ని నాలూరాచ్చాన్ పల్కినట్లు తిరువాయ్‌మొళ్రిప్పిళ్ళై తెలిపారట.

ఈ ఐతిహ్య ప్రస్తావనను బట్టి నాలూరాచ్చాన్‌పిళ్ళై విషయంలో శ్రీమణవాళ మహామునులకు గల గౌరవం వ్యక్తమవుతున్నది. ఈ ఐతిహ్యాన్నే ఇదే సందర్భంలో తిరువాయ్‌మొళ్రిప్పిళ్ళై కూడా తమ వ్యాఖ్యానంలో కొద్ది తేడాతో ప్రస్తావించారు.

నాలూరాచ్చాన్‌పిళ్ళై అనుగ్రహించిన గ్రంథాల వివరం స్పష్టంగా తెలియడంలేదు. ప్రస్తుతం ముద్రింపబడే చరమోపాయతాత్పర్య గ్రంథం ఆరంభంలో నాలూరాచ్చాన్‌పిళ్ళై రచించినట్లు ముద్రింపబడింది. ఈగ్రంథంలో ఉట్టంకింపబడిన ప్రమాణాలకు వివరణాన్ని అనుగ్రహించిన ప్రకాశకులుకూడా **"చరమోపాయతాత్పర్యం దేవరాజగురూదితమ్"** అని నాలూరాచ్చాన్‌పిళ్ళై కృతిగానే తెలిపారు.

ప్రకృత గ్రంథనామంలోని, చరమోపాయశబ్దంద్వారా చరమోపేయం కూడా లక్షింపబడుతున్నది. అందువల్ల చరమోపాయ, చరమోపేయాల తాత్పర్యాన్ని నిశ్చయించి తెలిపే గ్రంథమైనందున ఈ గ్రంథానికి ఈ పేరు వచ్చింది. చరమమంటే ఉత్తమమని అర్థం. ఉత్తమమైన ఉపాయం, ఉపేయం- రెండూ భగవద్రామానుజుల శ్రీచరణాలే- అనే అర్థాన్ని నాలూరాచ్చాన్‌పిళ్ళై ఈ గ్రంథంలో పలువురు పూర్వాచార్యులు పల్కిన సూక్తుల ప్రమాణీకరిస్తూ నిశ్చయించారు. పాంచరాత్ర ప్రమాణాలను, ఎమ్బార్, భట్టర్, నమ్బిళ్ళై, సోమాశియాణ్డాన్, అళ్గకియమణవాళచ్చీయర్, నాయనార్ ఆచ్చాన్‌పిళ్ళై మొదలైనవారి సూక్తులను, అముదనార్ అనుగ్రహించిన ఇరామానుశనూఱ్ఱన్దాది పాశురాలను నాలూరాచ్చాన్‌పిళ్ళై ఉదాహరించారు. దీనిలోని పలు వాక్యాలకు శ్రీవచనభూషణ గ్రంథంలోని వాక్యాలతో పోలిక ఉన్నందున దీనిని శ్రీరామానుజుల విషయంలోని శ్రీవచనభూషణంగా భావించడంలో అడ్డులేదు.



ఇక్కడ ముఖ్యంగా గమనించవలసిన విషయం ఒకటి ఉన్నది. శ్రీమన్నారాయణుడే ఉపాయోపేయరూపుడనే వైదికసిద్ధాంతానికి శ్రీరామానుజుల ఉపయోపేయయత్వభావన విరుద్ధమనే భ్రమను ఎంతమాత్రం పొందరాదు. తదనుగుణంగా శ్రీరామానుజుల ప్రాప్యప్రాపకత్వాన్ని సమన్వయించుకోవాలి. అందువల్ల ఈ గ్రంథంలో తెలుపబడిన విషయం అతివాదం కాదని, సకల పూర్వాచార్యా సమ్మతమని గ్రహించాలి. **"ఉడైయర్"** (స్వామి) అని సంప్రదాయంలో శ్రీరామానుజులను వ్యవహరించడంలోని ఆంతర్యాన్ని మఱువ రాదు. **"దేవమివాచార్య ముపాసీత", "యస్య దేవే పరా భక్తిః యథాదేవే తథా గురౌ"** ఇత్యాదిసూక్తుల అర్థతత్త్వాన్ని గ్రహించినపుడు ఈశంకకు అవకాశం లేదు.

చరమోపాయ భావన అంటే - ఆచార్యులే ఉపాయమనే నమ్మకం. **"సత్యం సత్యం పునః సత్యం యతిరాజో జగద్గురుః", "తస్మిన్ రామానుజార్యే గురురితి చ పదం భాతి నాన్యత్ర"** ఇత్యాది ప్రమాణాల వల్ల ఈ ఆచార్యపదతాత్పర్యం రామానుజులందే నిశ్చయింపబడినదని తెలుస్తున్నది. ఈ విషయమే ఈ గ్రంథంలోని ప్రధాన ప్రమేయం.

అమూల్యమైన ఈ గ్రంథం ఇప్పటికి సుమారు నూఱు సంవత్సరాలకు ముందు తెలుగు లిపిలో ముద్రింపబడింది. ఇపుడు దుర్లభం. ఈ గ్రంథంపేరును కూడా ఈ తరంలోని పలువురు విని ఉండరనడంలో ఆశ్చర్యం లేదు. భగవద్రామానుజ సహస్రాబ్దిమహోత్సవం అత్యతం చేరువలో ఉన్న ఈ సమయంలో వారి వైభవాన్ని ప్రకటించే ప్రకృతగ్రంథాన్ని ముద్రించడం సందర్భానుగుణమని, శ్రీరామానుజముఖోల్లాస కైంకర్యంగా పర్యవసిస్తుందని తలచి, ఈ గ్రంథాన్ని ఆంధ్రానువాదంలో పునర్ముద్రిస్తే బాగుంటుందని దాసుడు చేసిన సూచనను సహృదయంతో స్వీకరించి, దీనిని తమ **పితృపాదులు, సదాస్మరణీయులైన ఉ.వే.శ్రీమాన్ వాధూల (సముద్రాల) వేంకటనరసింహాచార్య స్వామి (అయోధ్యస్వామి)** వారి పవిత్రస్మృతిగా నిర్వహింపబడే ఉభయవేదాంత సభల జ్ఞాపికగా ముద్రించడానికి ముందుకు వచ్చిన మిత్రమణులు, దాసునిపట్ల సౌభ్రాత్రాన్ని కలవారైన ఉ.వే.శ్రీమాన్ సముద్రాల శఠకోపాచార్యస్వామివారి

సన్నిధిలో, వారి సహోదరులిద్దరి సన్నిధిలో హార్దకార్తజ్ఞ్యాన్ని వ్యక్తం చేస్తున్నాను. చరమపర్వనిష్ఠాగ్రేసరులు, సదా శ్రీరామానుజ ధ్యాననిష్ఠులు, నిత్యం శ్రీరామానుజ శతకాన్ని పరమప్రావ్యంగా అనుసంధించుకునేవారైన శ్రీఅయోధ్యస్వామివారి తిరునక్షత్రోత్సవ జ్ఞాపికగా భాగవద్రామానుజ వైభవ ప్రతిపాదకమై ఈ గ్రంథాన్ని ప్రకటించడం వారి ముఖోల్లాసరూప కైంకర్య పర్యవసాయి కాగలదనడం నిశ్చయం. గ్రంథాన్ని డి.టి.పి. చేసి అందంగా ముద్రించడంలో సహాయపడిన శ్రీచంద్రశేఖర్, శ్రీమతి జయలక్ష్మి, మిత్రమణి శ్రీమాన్ శ్రీకాంతాచార్యగార్లకు నా హార్దిక నమస్సులు. తమ వార్ధక్య ప్రయుక్తమైన అశక్తిని లెక్కించకుండా గ్రంథాన్ని అవలోకించి, మంగళా శాసనాలను అనుగ్రహించిన మహామహోపాధ్యాయ, డా॥ ఉ.వే.శ్రీమాన్ ఎస్.ఎస్.సి రఘునాథాచార్య స్వామివారి సన్నిధిలో సవినయంగా కృతజ్ఞతా పూర్వకంగా ప్రణమిల్లుతున్నాను. నా ఈ ప్రయత్నాన్ని ఆమోదించి, అను వాదంలో మార్గదర్శకాన్ని చేసిన అస్మత్పిత్రుపాదులు, న్యాయవేదాంత విద్వాన్, ఉభయవేదాంత భాస్కర, ఉ.వే. శ్రీమాన్ రంగాచార్య స్వామివారి సన్నిధిలో సాష్టాంగ ప్రణిపాతాలను సమర్పించుకుంటున్నాను. ఇంకా ఇటువంటి శ్రీరామా నుజవైభవ ప్రతిపాదకాలైన ఏక శ్లోకవ్యాఖ్య, అంతిమోపాయనిష్ఠ వంటి సద్గ్రంథాలు పెద్దలకు మంగళాశాసనాలతో త్వరలో ముద్రింపబడగలవని ఆశిస్తూ, స్వస్తి.

ఏతస్మిన్ చరమోపాయ తాత్పర్యే కృతిశేఖరే ।
గురుణా దేవరాజేన ప్రణీతే కరుణాళుణా ॥
శ్రీమద్రామానుజాచార్య చరమోపాయతా స్ఫుటమ్ ।
హేతుభిః సూక్తిభిః పూర్వగురూణాం చ నిరూపితా ॥
గ్రంథోయ మాంధ్రభాషాయాం శింగరార్యేణ భక్తితః ।
అనూద్యతే సుహృద్వాక్యాత్ నిర్మత్సరవిదాం ముదే ॥
వాధూల శ్రీనృసింహార్య జన్మర్క్షోత్సవ చిహ్నికా ।
సేయం తన్ముఖోల్లాసకారిణీ నితరాం భవేత్ ।

ఇట్లు నివేదించు
భాగవతవిధేయుడు
ఈ.ఏ. శింగరాచార్యులు

తిరుపతి
15-12-15



శ్రీమతే రామానుజాయ నమః



నాలూరాచ్చాన్ పిళ్లై అనుగ్రహించిన

# చరమోపాయ తాత్పర్యమ్

ఆంధ్రానువాదంతో

శ్లో॥ చరమోపాయతాత్పర్యం యతీంద్రవిషయేఽకరోత్ ।
య స్తమార్యవరం వందే దేవరాజాహ్వయం గురుమ్ ॥

భగవద్రామానుజుల విషయంలో చరమోపాయతాత్పర్యమనే గ్రంథాన్ని రచించినవారు, దేవరాజులనే పేరు గల నాలూరాచ్చాన్‌పిళ్ళై అనే ఆచార్య వర్యులను నమస్కరిస్తున్నాను.

---

**భగవత్ప్రాప్తిప్రతిబంధకమాన సంసారత్తిల్ అరుచి పిఱన్దు, భగవచ్చరణావిన్ద ప్రాప్తిరూపమాన మోక్షత్తిల్ ఇచ్చై పిఱన్ద అధికారి, తత్సిద్ధ్యర్థమాక, చరమపర్వమాన ఎంబెరుమానారభిమానత్తిలే ఒదుఙ్గి, తద్విషయప్రపత్తినిష్ఠైయై యుడైయనాయిరుక్క వేణుమ్.**

భగవంతుని పొందడానికి అడ్డుగా ఉండే సంసారంలో వెగటు (అరుచి) కలిగి, భగవచ్చరణారవిందాలను పొందడమనే మోక్షంలో ఇచ్ఛ కలిగిన మోక్షాధికారి (ముముక్షువు) ఆ భగవత్ప్రాప్తిని పొందడంకోసం, చరమపర్వమైన భగవద్రామానుజుల అభిమానంలో ఒదిగి, వారి విషయంలో ప్రపత్తిని చేసినవాడై ఉండాలి.

**భగవత్ప్రాప్తిరూపమోక్షత్తై ప్పెఱుకైక్కు్కడలాక వేదాంతంగళిలే కర్మాద్యుపాయ చతుష్టయత్తై చ్చొల్లిప్పోఱానిఱ్క, అత్తై విట్టు, అతిల్ లఘువాన చరమపర్వ**

**విషయత్తిల్ ప్రతిపత్తియై పేఱ్ఱుక్కుడలాక అవలంబిక్కుమ్బడి ఎజ్ఞనే? ఎన్నిల్, "యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః, స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే" (గీత-3.21) ఎన్గిఱ కణక్కిలే జ్ఞానాధికరాన నమ్పూర్వాచార్యర్కళ్ యాతొన్రై యను ష్ఠిత్తార్కళ్, యాతొన్రై యతఱ్కు ప్రమాణమాక అఙ్గీకరిత్తార్కళ్. అవై యిరణ్డు మిఱే పిన్బుళ్ల అస్మదాదికళుక్కు గ్రాహ్యంగళ్.**

భగవత్ప్రాప్తి అనే మోక్షాన్ని పొందడానికి సాధనాలుగా వేదాంతశాస్త్రాలు కర్మజ్ఞాన భక్తి ప్రపత్తులనే ఉపాయాలను నాల్గింటిని తెలుపుతూ ఉండగా, వానిని విడిచి, అంతకంటే లఘువైన చరమపర్వవిషయంలో (శ్రీరామానుజుల విషయంలో) ప్రపత్తిని ప్రాప్యానికి తగిన సాధనంగా అవలంబించడం ఏమి ? అని అంటే, **"యద్యదాచరతి శ్రేష్ఠ తత్తదేవేతరో జనః, స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే"** (అన్ని శాస్త్రాలను తెలిసినవాడని, అనుష్ఠాన సంపన్నుడని ప్రసిద్ధుడైన వ్యక్తి ఏయే రీతులలో అనుష్ఠిస్తాడో, ఆ యా రీతులనే పూర్ణజ్ఞానం లేనివాడుకూడా అనుష్ఠిస్తాడు. ఆ శ్రేష్ఠమైన వ్యక్తి ఆవిధంగా తాను అనుష్ఠించే కార్యాలను ఎంత ఎంత పరిమితిలో- ప్రమాణంలో అనుష్ఠిస్తాడో, తావత్పర్యంతమే ఆ కార్యాలు అనుష్ఠించాలని పూర్ణజ్ఞానం లేని మానవుడు కూడా తలచి, ఆ శ్రేష్ఠవ్యక్తిని అనుసరించి అనుష్ఠిస్తాడు) అనే రీతిలో జ్ఞానంలో గొప్పవారైన మన పూర్వాచార్యులు దేనిని అనుష్ఠించారో, దేనిని ప్రమాణంగా అంగీకరించారో ఆ రెండు (ఆ కార్యం, దాని ప్రమాణం)- అనే రెండే కదా అనంతరకాలానికి చెందిన మనకు గ్రహించదగినవి.

"కర్మజ్ఞానం చ భక్తిః ప్రపదన మితి చ ప్రాప్యసిద్ధ్యర్థమేతాన్
**ఆలోచ్యాలోచ్య హేతూన్ పునరిహ సుతరాం దోషదృష్టిం విధాయ ।
కర్తుం శక్తా న పూర్వే యతివరచరణ ద్వంద్వమూర్ధాభియుక్తా
స్తత్కారుణ్యాభిమానా త్తదను చ గురవో ముక్తి మాప్తా మహాప్తాః ॥**

**ఎన్ఱు కర్మజ్ఞాన భక్తిప్రపత్తికళాకిఱ ఉపాయచతుష్టయత్తైయుమ్ పేఱ్ఱుక్కుడలాక ప్పఱ్ఱలామో? ఎన్ఱుణర్న్దుణర్న్దు పార్త్తవిడత్తిల్, స్వరూపవిరుద్ధత్వ దుశ్శకత్వ**



**విశ్వాసభూయస్త్వాది దోషంగళై క్కాణ్గైయాలే, ఇవైకళెల్లామ్, అరుమ్ తేవైకళాయిరున్దతెన్ఱు పరిత్యజిత్తు, ఎమ్బెరుమానార్క్కు మున్బుళ్ల ఆచార్యర్కళుమ్, పిన్బుళ్ళ ఆచార్యర్కళుమ్, తాజ్గళ్ జ్ఞానాధికరుమాయ్ ప్రామాణికాగ్రేసరరు మాయిరుక్కైయాలే, పరమకారుణికరాయ్, ప్రపన్నజనకూటస్థరాన ఎంబెరు మానారుడైయ తిరువడికళ్ సంబంధత్తైయుమ్ తిరుముడిసంబంధత్తైయుమ్, పెఱ్ఱుడైయరాయ్, ఎంబెరుమానారుడైయ కారుణ్యప్రవాహజనితమాన అభిమానత్తాలే పేఱు పెఱ్ఱార్కళిఱే.**

కర్మం, జ్ఞానం, భక్తి, ప్రపత్తి -అనే నాల్గు ఉపాయాలను పొంది, వాటిని మోక్షసాధనాలుగా గ్రహించినా, ఆ ఉపాయాలు ప్రాప్యసిద్ధిని కల్గిస్తాయా? అని బాగా ఆలోచించి ఆలోచించి చూచి, ఈ ఉపాయాలలో చాలా దోషాలను గమనించి- అంటే- ఇవి పరతంత్రమైన ఆత్మస్వరూపానికి విరుద్ధాలనే ప్రధాన దోషాన్ని, ప్రపత్తి అనే ఉపాయం మహావిశ్వాసరూపమై ఉండడమేకాక, నిరంకుశుడైన భగవానుని స్వాతంత్ర్యభయం దీనికి నియతంగా ఉన్నదనే ప్రపత్తి దోషాన్ని బాగా గమనించి, వీటిని అనుష్ఠించడానికి సమర్థులు కానివారై, జ్ఞానాధికులై, ప్రామాణికాగ్రేసరులైన మన పూర్వాచార్యులు, శ్రీరామానుజుల చరణద్వంద్వ సంబంధంచేత, శిరస్సుయొక్క సంబంధంచేత సమస్త శిష్టజనులకు పూజ్యులై, ఆ శ్రీరామానుజుల నిర్హేతుక కృపవల్ల కల్గిన అభిమానంతో తమను ఆశ్రయించినవారితో పాటుగా మోక్షాన్ని పొందారు అనే రీతిలో కర్మజ్ఞానభక్తి ప్రపత్తులనే నాల్గు ఉపాయాలను ప్రాప్యసిద్ధికి తగినవిగా అనుష్ఠించ వచ్చునా? అని పరిశీలించి, పరిశీలించి బాగా చూచినపుడు - వాటిలో స్వరూపవిరుద్ధాలై ఉండడం, దుశ్శకాలై ఉండడం, మహావిశ్వాసాన్ని పొందవలసి ఉండడం- అనే దోషాలను గమనించినందున, ఇవి అన్నీ దుష్కరోపాయాలై ఉన్నాయని వాటిని విడచిపెట్టి, భగవద్రామానుజులకు ముందున్న పూర్వాచార్యులు, తరువాత గల పూర్వాచార్యులు, తాము జ్ఞానాధికులు, ప్రామాణికులలో గొప్పవారైనందున, పరమకారుణికులు, ప్రపన్నజనకూటస్థులైన భగవద్రామానుజుల శ్రీచరణ

సంబంధాన్ని, శిరఃసంబంధాన్ని పొందినవారై, శ్రీరామానుజుల కరుణా ప్రవాహంవల్ల కల్గిన అభిమానంతో ప్రాప్యసిద్ధిని పొందారు.

**పూర్వర్కళుడైయ అనుష్ఠానత్తై ప్పిడిత్తు నడత్తువ్వోతు, అతు ప్రమాణపురస్సర మాకావిడిల్ నిరస్తకోటియిల్ ఆంతర్భవియాతో? ఎన్నిల్, "ధర్మజ్ఞ సమయః ప్రమాణమ్" ఎన్నుమ్, "మేలైయార్ శెయ్‌వనకళ్" ఎన్నుమ్ (తిరుప్పావై-26) శిష్టాచారమే ప్రబలప్రమాణమాక చ్చొల్లక్కాణ్కైయాలే ప్రమాణసిద్ధమాయిరుక్కుమ్. ఇవర్ కళనుష్ఠానమ్ ప్రమాణానుగుణమాయల్లతరాతితే. "విధయశ్చ వైదికా స్త్వదీయ గంభీరమనోనుసారిణః" (స్తోత్రరత్నమ్-20) ఎన్గతితే.**

పూర్వాచార్యుల అనుష్ఠానాన్ని అనుసరించి అనుష్ఠించేటపుడు, అది (పూర్వాచార్యానుష్ఠానం) ప్రమాణ పురస్సరంగా కాకపోతే అది భగవానునిచే నిరసింపబడే దానిలోకి చేరదా? అని అంటే, **"ధర్మజ్ఞసమయః ప్రమాణమ్"** (ఆయా అధికారులకు తగినట్లుగా నిషేధింపబడినవి అయిన సకల ధర్మాలను తెలిసినవారి ఆచారం ప్రబలప్రమాణం) అని, **"మేలైయార్‌శెయ్‌వనగళ్"** (శిష్టులు ఆచరించేవి) అని శిష్టాచారమే ప్రబల ప్రమాణంగా చెప్పబడుతున్నందున, వారి అనుష్ఠానం ప్రమాణసిద్ధమై ఉంటుంది. వారి అనుష్ఠానం ప్రమాణాలకు అనుగుణంగా ఉండకుండా ఉండదుకదా! **"విధయ శ్చ వైదికా స్త్వదీయ గంభీరమనోను సారిణః"** అని చెప్పబడుతున్నది కదా!

(**"ఇదం కురు, ఇదం మాకార్షీః"**- దీనిని ఆచరించు, దీనిని ఆచరించకు- ఇత్యాది స్వతంత్రమైన వైదికవిధులు, అనన్యప్రయోజనులై, ఆశ్రయించినవారి గంభీరమైన మనస్సును అనుసరిస్తాయి. వారి మనస్సుకు గాంభీర్యం ఏమంటే- క్షుద్రమైన లౌకికభోగాలలో కాలు కూరుకుపోకుండా, అనన్యప్రయోజనంగా ఉండడం. **"నినైదొఱుమ్ శొల్లున్దొఱుమ్ నెఞ్జిడిన్దుకుమ్"**- తలచినపుడు, పల్కినపుడంతా మనస్సు భగ్నమై ద్రవిస్తుంది - అనే రీతిలో భగవద్విషయంలో అవగాహించినవారికి కదా **"నిదిధ్యాసితవ్యః"** అనే విధి ఆవశ్యకం)

**ఇతుక్కుమేలే ముక్తకంఠమాక ప్రమాణముణ్డాకిల్ ముఖ్యమన్రో? ఎన్నిల్, అతుతానుముణ్డు. ఎఙ్గనే? ఎన్నిల్, శ్రీశాస్త్రత్తిలే పెరియపిరాట్టియై క్కుఱిత్తు, ఈశ్వరన్ తన్నుడైయ అవతారవైభవత్తై చ్చొల్లుకిఱవిడత్తిలే -**



ఇంతకుమించి ముక్తకంఠమైన ప్రమాణం ఉంటే అది ముఖ్యం కదా? అని అంటే, అటువంటి ప్రమాణంకూడా ఉన్నది. అది ఏమి? అంటే, పాంచరాత్రంలో భగవానుడు లక్ష్మీదేవిని ఉద్దేశించి తన అవతార వైభవాన్ని తెలిపే సందర్భంలో -

**"సమ్యగుక్తం త్వయా విష్ణో! జన్మనాం తవ వైభవమ్ ।**
**త్వదాచార్యావతారత్వ ప్రకారమపి మే వద ॥**
**త్వయాచార్యవతారస్తు కిమర్థం క్రియతే ప్రభో ।**
**కృతస్యాప్యవ తారస్య ఫలం వా కిమవాప్స్యసి ॥**
**ఇతి పృష్టో మహాలక్ష్మ్యా భగవాన్ పురుషోత్తమః ।**
**గురురూపావతారస్య మాహాత్మ్యం వక్తు ముద్యతః ॥**

సర్వాంతర్యామివి అయిన విష్ణూ ! నీవు నీ అవతారాల వైభవాన్ని గూర్చి ఇంత వరకు చక్కగా తెలిపావు. ఆచార్యరూపమైన నీ అవతార విశేషంయొక్క రీతినిగూర్చి నాకు ఇపుడు తెలియజేయాలి. ఓ స్వామీ ! ఆచార్యావతారమనే దానిని నీవు ఏ ప్రయోజనం కోసం ఎత్తుతున్నావు? ఆవిధంగా ఎత్తిన ఆచార్యావతారం వల్ల ఏ ప్రయోజనాన్ని నీవు పొందబోతావు? అని అడిగింది.

అపుడు భగవానుడు ఈ విధంగా లక్ష్మీదేవిచే ప్రశ్నింపబడిన, షాడ్గుణ్య పరిపూర్ణుడై, నిత్యసూరి నిర్వాహకుడై ఉండే భగవంతుడు తన ఆచార్యావతార రూపంయొక్క వైభవాన్ని గూర్చి చెప్పడానికి ప్రయత్నించినవాడయ్యాడు.

**శ్రీభగవాన్ -**

**సాధు పృష్టస్త్వయా దేవి! సారాంశ స్సారవిత్తమే! ।**
**శృణు వక్ష్యే మదాచార్య జన్మనో వైభవం తవ ॥**

సారం తెలిసినవారిలో శ్రేష్ఠురాలవైన, అందరికీ ఆశ్రయించదగినదానవైన ఓ లక్ష్మీదేవీ! శ్లాఘ్యమైన, సారభూతమైన విషయాన్ని నీవు అడిగావు. నేను ఎత్తిన ఆచార్యావతారంయొక్క వైభవాన్ని నీకు తెలుపుతాను విను.

**సంసారసాగరే మగ్నాన్ చేతనానుజ్జిహీర్షయా ।**
**శ్రుతిస్మృతిపురాణాని చేతిహాసాః ప్రదర్శితాః ॥**

సంసారమనే పెద్ద సముద్రంలో మునిగి ఉండే బద్ధచేతనులను ఉద్ధరించాలనే ఆశతో నేను అపౌరుషేయాలు, నిత్యాలు, నిర్దోషాలు, స్వతఃప్రమాణాలైన ఋగాది వేదాలను, తదుపబృంహణాలైన స్మృతులను, ఇతిహాసాలను, పురాణాలను విశదంగా వ్యక్తం చేశాను.

**తేన మార్గేణ కేనాపి ముక్తిర్లబ్ధా న భూతలే ।**
**తతో విభవరూపేణ జన్మాని సుబహూని మే ॥**

ఇంత చేసినా, పూర్వం నేను ఉపదేశించిన శ్రుత్యాదిమార్గంవల్ల లీలావిభూతిలో ఒక్కడు కూడా ముక్తిని పొందలేదు. ఈ విధంగా నా ఆజ్ఞారూపాలైన శ్రుతులు, స్మృతులు మొదలైనదానిద్వారా నేను తలచిన రీతిలో జీవులు తరించనందున చేతనులను ఉద్ధరించడంకోసం నా ఇచ్ఛతో అవతారాలను ఎత్తాను.

**జాతాని దేవి! తత్రాపి మోక్షార్థీ కోఽపి నాభవత్ ।**
**వేదాంతే వివిధోపాయా భక్త్యాద్యా విహితా మయా ॥**
**తేష్వప్యశక్తా హ్యాత్మాన స్సంసరంతి పునఃపునః ।**
**ఏవంబహువిధోపాయేష్వనిష్పన్న ఫలేష్వహమ్ ॥**
**సదాచార్య స్వరూపేణ జనిత్వా సర్వచేతనాన్ ।**
**వ్యూహగ్రాహం గృహీత్వైవ గమిష్యామీత్య చింతయమ్ ॥**

ఓ దేవీ! జీవులను ఉజ్జీవింపజేయడంలో నాకంటే ముందున్నదానవై, సంతోషించేదానా! ఆ రీతిలో నేను పలు అవతారాలను ఎత్తినా, **"అవజానంతి మాం మూఢాః మానుషీం తనుమాశ్రితమ్"** - మానవ రూపాన్ని ఎత్తిన నన్ను మూఢులైన ఈ లోకంలోని వారు అవమతిస్తున్నారు - అనే రీతిలో నేను సజాతీయుడనై, సులభుడనై అవతారించాననే కారణంవల్ల వారు నన్ను లెక్కించకుండా ఉన్నవారై, ఎవరూ కూడా మోక్షంలో ఇచ్చను కలవారు కాలేదు. **"పడాదన పట్టు మనిశర్క్కాయ్"** అనే రీతిలో నేను అవతరించి ఇంతశ్రమ పడడమే కాక, పరబ్రహ్మప్రతిపాదనపరాలైన వేదాంతశాస్త్రాలలో భక్తియోగం మొదలైన మోక్షోపాయాలను కూడా విధించాను. అయినా, జీవులు ఆ ఉపాయాలను అనుష్ఠించడంలో శక్తి లేనివారై, మాటిమాటికీ సంసారంలోనే పడి ఉన్నారు. ఈ విధంగా నేను చేతనోద్ధరణార్థం చేసిన ఉపాయాలన్నీ వ్యర్థమైపోయినందున, సర్వజ్ఞుడనైన నేను, "జ్ఞానానుష్ఠానాలను చక్కగా కల్గిన ఆచార్యుడనై అవతరించి, సకలజీవులను అందఱిని పోగుచేసికొని గ్రహించి పరమపదానికి తీసికొనిపోతాను''- అని తలచాను.



**ఏవం సంచింత్య పద్మాక్షి! గురురూపేణ వై పురా ।**
**అవతీర్ణో జనాన్ కాంశ్చిద్భవాదభ్యుద్ధరం రమే! ॥**

తామరపూలవంటి కన్నులను కలదానవై, నాకు ఆనందాన్ని కల్గించేదానవై, స్వయంగా నిర్భరురాలవైన ఓ లక్ష్మీ! ఈ విధంగా తలచి, పూర్వం నేను దత్తాత్రేయుడు మొదలైన ఆచార్యుల రూపంలో అవతరించి, కొందఱు బద్ధజీవులను జన్మమరణాత్మకమైన సంసారనుండి ఉద్ధరించాను.

**ఇతఃపరం చాపి కరిష్యతే మయా యథా పురా దేవి! జనిః కృతా తథా ।**
**గురుస్వరూపేణ నిమగ్నచేత నాన్ సముద్ధరిష్యామి నిజప్రభావతః" ॥**

ఓ దేవీ ! నాకు అభిమతమై ఉండే రూపాలను, ఆత్మవిగ్రహ గుణాలను కల్గినదానా ! పూర్వం ఆచార్యావతారాన్ని ఏవిధంగా ఎత్తానో ఆవిధంగానే ఇకపై కూడా ఎత్తగలను. ఆ విధంగా స్వీకరింపబడే నా అవతారాలలో ఆచార్యరూపినై, సంసారసాగరంలో మునిగిఉండే బద్ధజీవులను ఆచార్యాభిమాన రూపమైన నా ప్రభావంచేత ఉద్ధరిస్తాను. **"న చ పునరావర్తతే"**- తిరిగి లోకానికి రాడు'' -అనే రీతిలో తరింపజేస్తాను) అని అన్నాడు.

లక్ష్మీః -

**కస్మిన్ కులే భవాన్ విష్ణో! కరిష్యతి గురోర్జనిమ్? ।**

**కస్మిన్ యుగేஉవతీర్ణ స్త్వంభవిష్యసి వద ప్రభో! ॥**

ఈ రీతిలో భగవంతుడు పల్కిన మాటను ఆలకించిన శ్రీదేవి మళ్ళీ ఈ విధంగా అన్నది.

"సర్వవ్యాపివి అయిన ఓ విష్ణుదేవా! నీవు ఆచార్యరూపంలోని విలక్షణమైన అవతారాన్ని ఏ కులంలో చేయబోతావు? సర్వనియంతవు అయిన స్వామీ ! నీవు ఏ యుగంలో అవతరించగలవు. ఈ విషయాన్ని **"తాన్యహం వేద సర్వాణి"** - నా అవతారాలను అన్నిటిని నేను తెలియుదును- అని నీవు పల్కిన రీతిలో తెలిసినవాడవు నీవే కనుక, నీవే వివరించాలి".

శ్రీభగవాన్ -

**అహ మాచార్యరూపేణ భవిష్యామి యుగేయుగే ।**

**తత్రాపి యోగినాం పుంసాం కులే మహతి జన్మ మే ॥**

అపుడు భగవానుడీ విధంగా అన్నాడు.

నిరవధికమైన తేజస్సును కల్గిన ఓ దేవీ! నేను సర్వజ్ఞుడైన ఆచార్యుని రూపాన్ని ధరించి, ప్రతియుగంలో అవతరిస్తాను. ఆ విధంగా అవతరించేటపుడు కూడా, పరమయోగులైన మహాపురుషుల, చాలా శ్లాఘ్యమైన కులంలో నా అవతారం సంభవిస్తుంది.

**విశిష్య మే దేవి! కలౌయుగే గురో! ర్జనిర్భవిత్రీ ఖలు సత్కులే రమే! ।**

**త్రిదండకాషాయపటోర్ధ్వపుణ్డ్రభాక్ భవిష్యతీ సా హి భుజిష్య భూయసీ ॥**

నిరతిశయమైన ఆనందాన్ని కల్గినదానవు, నాకు పట్టమహిషివి అయిన లక్ష్మీ! కలియుగంలో అయితే ఒక విలక్షణమైన వంశంలో, నాకు పూర్వం సంభవించిన అవతారాలకంటే విలక్షణంగా, ఆచార్యరూపావతారం సంభవిస్తుంది. ఇది ప్రమాణప్రతిపన్నం సుమా! (**"అడైయార్ కమలత్తలర్మకళ్ కేళ్వన్"** అనే పాశురంలో చెప్పబడినట్లు మనస్సు, బుద్ధి, జ్ఞానాలకు, సాత్త్వికతామసాహంకారాలనే రెండు విధాలైన అహంకారాలకు అభిమాని దేవతలైన చక్రాది పంచాయుధాలు, నా భావాన్ని అనుసరించి, నేను తలచిన కార్యంలో సహకరిస్తాయి కనుక) గొప్ప శిష్యసంపదను కల్గినదై, **"కాషాయ శోభి"** ఇత్యాదిగా త్రిదండం, కాషాయవస్త్రం, ఊర్ధ్వపుండ్రాలను కల్గినదై ఆ అవతారం సంభవించగలదు. (ఈ శ్లోకంలోని **"ఖలు"** అనే అవ్యయాలద్వారా చెప్పబడిన అర్థం ప్రసిద్ధమని తెలుపబడింది.)

**సర్వోపాయదరిద్రాణాం చేతనానాం వరాననే! ।**

**మమాభిమానాత్సర్వేషాం ముక్తి ర్గురుశరీరిణః ॥**

సర్వోత్కృష్టమైన అందమైన ముఖాన్ని కల లక్ష్మీ! కర్మజ్ఞాన భక్తి ప్రపత్తులనే ఉపాయాలను అనుష్ఠించలేని అజ్ఞులు, జ్ఞానాధికులు, భక్తి వివశుల రూపంలోని సమస్తచేతనులకు **"పీతకవాడై ప్పిరానార్ పిరమగురువాకి వన్దు"** ( పీతాంబర ధారియైన స్వామి పరమాచార్యుడై అవతరించి) - అనే రీతిలో ఆచార్యరూపి అయిన నా అభిమానంవల్ల ముక్తి కల్గుతుంది. ఇందులో సందేహంలేదు.

(ఇక్కడ భక్తి వివశులంటే ఆచార్యప్రేమవల్ల శిథిలమైన మనస్సు కలవారై, ఆనృశంస్యంవల్లగాని, పరార్థంగాగాని- దేనిని క్రమాను సారంగా అనుష్ఠించ లేనివారు.)

**మద్భక్తా జ్ఞానపూర్ణా యే భవిష్యంతి కలౌ యుగే ।**

**త్రిదండినోஉభి మానాన్మే తే సర్వే గురురూపిణః ।**

**ముక్తిభాజో భవిష్యంతి సత్యేనాహం బ్రవీమి తే ॥**

**"కలియుమ్ కెడుమ్, కణ్డుకొణ్మిన్"**- (కలి నశిస్తుంది, చూడండి)- అనే రీతిలోని వైలక్షణ్యాన్ని కల ఈ కలియుగంలో జ్ఞానపూర్ణులై అర్థపంచకజ్ఞాన పూర్తిని కలవారై, ఆచార్యరూపి అయిన నాపట్ల నిరతిశయభక్తిని కలవారై ఎవరుంటారో,

వారందఱు, త్రిదండధారియై, ఆచార్యరూపియై ఉండే నా అభిమానంవల్ల ముక్తిని పొందగలరు. ఈ విషయంలో నేను నీకు శపథం చేస్తున్నాను.

ఇక్కడ జ్ఞానపూర్తి అంటే - "ఎల్లామ్ వకుత్తవిడమే ఎన్ఱిరుక్క క్కడవన్" అనే రీతిలో పరత్వాది పంచకం అంతా ఆచార్యుడే- అనే జ్ఞానాన్ని కల్గి ఉండడం.

**మత్కృతో యోఽభిమాన స్స్యా దాచార్యత్వే శుభాననే! ।**
**స ఏవ ముక్తిదో దేవి! భవిష్యతి న సంశయః, ॥**

అందఱికి శుభాలను కల్గించే చక్కని ముఖాన్ని కల్గినదానా! నా ఉభయ విభూత్యైశ్వర్యానికి సహధర్మచారిణివి అయిన ఓ లక్ష్మీదేవీ ! ఆచార్యకార్యమైన ఉపదేశం విషయంలో - అనంతరకాలంలోని ఆచార్యులు ఉపదేశించినా, ఆ ఉపదేశం కృపామాత్రప్రపన్నుడనైన - నాచే చేయబడినదని భావించడమనే నా విషయంలోని అభిమానమే -అంటే- ఉపదేశం చేసే ఆచార్యులు జ్ఞానానుష్ఠాన పూర్తిని చూడకుండా, ఆ ఉపదేశం నాచే చేయబడినదనే అభిమానమే మోక్షప్రదం కాగలదు. ఇందులో సందేహం లేదు.

**గురురూపస్య మే నామ్నా సమయో విజయీ భవేత్ ॥**
**మత్కాలాదను పద్మాక్షి! సమయో లోప మేష్యతి ॥**

అటువంటి ఆచార్యరూపమైన అవతారం ద్వారా నాచే ఉద్ధరింపబడిన విశిష్టాద్వైత సిద్ధాంతం ఆచార్యరూపి అయిన నా పేరుతో సర్వదేశ సర్వకాల సర్వావస్థలలోను అభివృద్ధిని చెందగలదు. తామరవంటి కన్నులను కల లక్ష్మీ! ఆ రీతిలో వృద్ధిని పొందిన, పరమ వైదికమైన విశిష్టాద్వైత సిద్ధాంత నా ఆచార్యరూపావతారం తరువాత సంకోచాన్ని పొందగలదు.

(ఇక్కడ "గురురూపస్య మే నామ్నా" అని అంటే భగవద్రామానుజ నామంతో - అని అర్థం. "ఎమ్బెరుమానార్ దర్శనమ్" అనే పేరుతో ప్రసిద్ధిని పొందగలదని భావం. "మత్కాలాదను"- అనే దానికి శ్రీవరవరమునుల అవతారానికి అనంతరమని తాత్పర్యం.)



**గురురూపస్య మే శక్తిం తత్ర తత్ర నిధాయ వై ।**
**సమయం సంగ్రహీష్యామి నాతిలుప్తో యథా భవేత్ ॥**

ఈ విషయాన్ని ముందుగానే నేను గమనించి, ఆచార్యరూపి అయిన నా దివ్యశక్తిని నాకు ఉద్దేశ్యమై ఉండే, నేను అభిమానించిన ఆయా దివ్యదేశాలలో అర్చారూపిరూపంగా ప్రతిష్ఠింపజేసి, లోపించ బోయే ఆ సిద్ధాంతాన్ని పూర్తిగా లోపించకుండా ఉండేటట్లు రక్షించగలను

**మమాచార్యావతారే తు యేషాం భక్తి ర్భవిష్యతి ।**
**తేషామేవ భవేన్ముక్తి ర్నాన్యేషాం సులభా భవేత్ ॥**

ఎవరికి ఆచార్యరూపమైన నా అవతారంలో స్నేహపూర్వకమైన అనుధ్యానం కలుగుతుందో వారికే భగవత్ప్రాప్తిరూపమైన ముక్తి సులభంగా లభిస్తుంది. ఆ ఆచార్యభక్తి లేనివారికి సులభం కాబోదు.

**అస్మిన్నర్థే హి విశ్వాస స్సర్వేషాం న జనిష్యతి ।**
**మత్కటాక్షో భవేద్యస్మిన్ మయ్యేవ ప్రవణో హి యః ।**
**తస్య తస్య హృదిస్థోఽయం భవిష్యతి న సంశయః ॥**

ఆచార్యాభిమానమే ఉత్తారకమనే ఈ విషయంలో 'ఇది పరమార్థ'' మనే విశ్వాసం అందఱికి కలుగదు. ఇది నిశ్చయం. అయితే ఏవిధంగా ఉజ్జీవించాలి? అని అంటే, ఏ చేతనుని విషయంలో ఆచార్యరూపి అయిన నా కటాక్షం కలుగుతుందో, ఏ చేతనుడు నాపట్ల ప్రావణ్యాన్ని కల్గి ఉంటాడో, ఆ యా అధికారి మనస్సులో స్థిరంగా ఈ భావవిశేషం- అంటే- ఆచార్యాభిమానమే ఉత్తారకమనే భావవిశేషం- కల్గుతుంది. ఇందులో ఏ సందేహం లేదు.

**ఎన్ఱిప్పడి ప్రబల ప్రమాణంగళై ఎంబెరుమాన్ తానే అరుళిచ్చెయ్ తువైక్కైయాలే ముక్తకంఠమాక ముఖ్యప్రమాణంగళుమ్ ఇవ్వర్థత్తిల్ కుఱైవఱ క్కాణ్ణిష్టన.**

ఇటువంటి ప్రబల ప్రమాణాలను భగవంతుడే స్వయంగా పల్కినందున ముక్తకంఠంగా ముఖ్యప్రమాణాలు కూడా "ఆచార్యాభిమానమే ఉత్తారక" మనే విషయంలో లోటు లేకుండా కన్పిస్తున్నవి.

**ఇవై యెల్లావ*ఱ్ఱై*యు ముట్కొండు, ఇంద ప్రమాణప్రతిపాద్యమాన అర్థంగళై త్తెళియ అఱిన్దు, నమ్మాచార్యర్‌కళనైవరుమ్ తన్నిష్ఠరాయ్, తంగళై ప్పఱ్ఱి నార్‌క్కుమ్ ఇత్తైయే యోగ్యతానుగుణమాక ఉదేశిత్తుప్పోన్దార్‌కళ్. ఇప్పడి ఆచార్యాభిమానమే ఉత్తారకమెన్నుమ్, త్రిదండధారియాయ్, ఆచార్యరూపేణ తానే అవతరిప్పనెన్నుమ్ ఈశ్వరన్ అరుళిచ్చెయ్‌కైయాలే మ*ఱ్ఱు*మనవరుళిచ్చెయ్‌త అర్థంగళెల్లామ్ ఎంబెరుమానారిడత్తిలేయాయ్*ఱ్ఱు* నిలైనిన్ఱిరుప్పతు, ఆకైయాల్ ఆచార్యత్వపూర్తియుళ్ళతు అవరిడత్తిలేయేయిఱే. అవరభిమానమే నమక్కెల్లామ్ ఉత్తారకమెన్ఱు సంశయవిపర్యయమఱ నమ్ పూర్వాచార్యర్‌కళుమ్ అఱుతియిట్టార్‌కళిఱే. ఆకైయాలే నమ్ పూర్వాచార్యకళనుష్ఠానమే నమక్కెల్లామ్ ప్రమాణమెన్బతు "ధర్మజ్ఞసమయ" మెన్నుమ్ ప్రబలప్రమాణ ప్రతిపన్నమెన్నుమ్ శొల్లి*ఱ్ఱు*.**

వీటిని అన్నిటిని పురస్కరించుకొని, ఈ ప్రమాణాలలో ప్రతిపాదింపబడిన విషయాలను స్ఫుటంగా గ్రహించి మన పూర్వాచార్యులందఱు (భగవద్రామానుజ రూపులైన) ఆచార్యుల అభిమానమే ఉత్తారకమనే విషయంలో నిష్ఠను కలవారై, తమను ఆశ్రయించినవారికి కూడా దీనినే వారి వారి యోగ్యతకు తగినట్లు ఉపదేశిస్తూ వచ్చారు. ఈవిధంగా ఆచార్యాభిమానమే ఉత్తారకమని, త్రిదండధారియై, ఆచార్యరూపంతో తానే అవతరిస్తానని శ్రియఃపతి పల్కినందున, ఇంకా అతడు పల్కిన విషయాలన్నీ భగవద్రామానుజుల విషయంలోనే సమన్వయిస్తాయి. అందువల్ల ఆచార్యత్వపూర్తి ఆ శ్రీరామానుజుల లోనే కదా ఉన్నది. వారి అభిమానమే మనకు అందఱికీ ఉత్తారకమని ఏవిధమైన సందేహం, భ్రమ లేకుండా పూర్వాచార్యులు నిశ్చయించారు. కనుక, మన పూర్వాచార్యుల అనుష్ఠానమే మనకు అందఱికీ ప్రమాణం అనేది **"ధర్మజ్ఞసమయః ప్రమాణమ్"** అనే ప్రబల ప్రమాణం ద్వారా ఏర్పడుతున్నదని తెలుపబడింది.



**ఇని, చరమపర్వమాన ఎమ్బెరుమానారభిమానత్తిలే ఒదుంగి, "తేవు మ*ఱ్ఱఱి*యేన్" ఎన్నుమధికారిక్కు, భక్తిప్రపత్తికళిరణ్డుమ్ భయావహమాయిరుక్కుమ్. ఎజ్ఞనే? ఎన్నిల్, భక్తితాన్ స్వయత్నసాధ్యమాకైయాలుమ్, భగవత్పరతంత్రమాన స్వరూపత్తుక్కు స్వప్రవృత్తివిరోధియాకైయాలుమ్, స్వస్వాతంత్ర్యరూపమాన అహంకారత్తై విళైవిత్తు, పారతంత్ర్యస్వరూపమాన ఆత్మసత్తైయై అ*ఴి*క్కుమెన్ఱు భయమ్ పిఱక్కుమిఱే.**

ఇక, చరమపర్వమైన భగవద్రామానుజుల అభిమానంతో ఒదిగి ఉండి, **"తేవు మఱ్ఱఱియేన్"** (వేఱొక దైవాన్ని తెలియను) అనే అధికారికి భక్తి ప్రపత్తులు రెండు భయాన్ని కల్గిస్తాయి. ఏవిధంగా ? అంటే, భక్తి అనేది స్వప్రయత్నంద్వారా సాధించదగినది కనుక, భగవానునకు పరతంత్రమైన ఆత్మస్వరూపానికి స్వప్రవృత్తి అనేది విరోధి అయినందున, అది స్వస్వాతంత్ర్యమనే అహంకారాన్ని కల్గించి, పారతంత్ర్య స్వరూపమైన ఆత్మ సత్తను నశింపజేస్తుందనే భయం కల్గుతుంది కదా!

**పారతంత్ర్య స్వరూపత్తుక్కు అనుగుణమాయ్, భగవద్విషయ విశ్వాసరూపమాన ప్రపత్త్యుపాయముమ్ "భవమోక్షణయో స్త్వయైవ జంతుః క్రియతే రంగనిధే!" ఎన్గిఱపడియే బంధమోక్షంగళిరణ్డుక్కుమ్ పొతువాయ్, నిరంకుశ స్వతంత్రనానన్ ఎంబెరుమాన్ తన్నుడైయ స్వాతంత్ర్యత్తాలే మీళవుమ్ సంసరిప్పిక్కిల్ శెయ్‌వతెన్? ఎన్ఱు భయప్పడప్పణ్ణుమ్. ఇప్పడి స్వప్రవృత్తిసాధ్యమాన భక్త్యుపాయ ముమ్, స్వప్రవృత్తినివృత్తిసాధ్యమాన ప్రపత్త్యుపాయముమ్ భయజనకమాకైయాలే చరమపర్వ నిష్ఠనుక్కు నెంజిల్ తంగాతు. ఆకైయాలిఱే, ఇవ్వధికారిక్కు భక్తి ప్రపత్తికళుపాయ మన్ఱు - ఎన్ఱుమ్, ఎమ్బెరుమానారుడైయ అభిమానమే ఉత్తారక మెన్ఱుమ్ నమ్పూర్వాచార్యర్‌కళ్ అఱుతియిట్టతుమ్.**

భగవత్పారతంత్ర్యానికి అనుగుణమై, భగవద్విషయ విశ్వాసరూపమైన (భగవానుడు తప్పక రక్షిస్తాడనే విశ్వాసరూపంలోని) ప్రపత్తి అనే ఉపాయం

కూడా "భవమోక్షణయోః త్వయైవ జంతుః క్రియతే రంగనిధే! త్వమేవ పాహి" (శ్రీరంగరాజస్తవం-ఉత్తరశతకం) ("నిధయేஉర్థినామ్"- అనే రీతిలో అర్థిజనానికి నిధియై, శ్రీరంగంలో యోగనిద్రలో ఉండే స్వామీ! జీవుడు నీవల్లనే బంధమోక్షాలు రెండిటికి విషయం అవుతున్నాడు. అందువల్ల నీవే నన్ను రక్షించు)

అనే రీతిలో బంధానికి, మోక్షానికి రెండిటికి సాధారణుడై (బంధాన్ని, మోక్షాన్ని ఇచ్చేవాడై), నిరంకుశస్వతంత్రుడైన భగవంతుడు తన స్వాతంత్ర్యంతో మళ్ళీ తిరిగి సంసారంలోకి ప్రవేశింపజేస్తే ఏం చేయాలి? అని భయపడేటట్లు చేస్తుంది. ఇటువంటి స్వప్రయత్నం ద్వారా సాధ్యమైన భక్తి- అనే ఉపాయం, స్వప్రవృత్తి యొక్క నివృత్తి ద్వారా సాధ్యమైన ప్రపత్తి - అనే ఉపాయం-ఈ రెండు భయాన్ని కల్గించేవి కనుక, ఇవి రెండు చరమపర్వనిష్ఠునకు మనస్సులో నిలువవు. అందువల్లనే కదా ఈ చరమపర్వనిష్ఠుడైన అధికారికి భక్తి ప్రపత్తులు ఉపాయాలు కావని, భగవద్రామానుజుల అభిమానమే ఉత్తారకమని మన పూర్వాచార్యులు నిశ్చయించారు.

("ఇరువల్లరుళ్ నల్ వినైకళ్" అనే ఆచార్యహృదయసూక్తి రీతిలో పుణ్యపాప రూపకర్మల మూలంగా సంసారంలో నిలిపి, ఈ సంసారుల దుఃఖాలను చూచి నిర్హేతుకకృపతో కటాక్షించి, నిరతిశయానంద రూపమైన తన ప్రాప్తి పర్యంతంగా వారిని ఉజ్జీవింపజేసే భగవంతుని లీలలను చూస్తే- భవమోక్షాలను రెండిటికి అతడే కల్గిస్తున్నాడని విశదమవుతుంది - అని తాత్పర్యం.)

**(ప్రయాణకాలే) ఇత్యాది. అతావతు - భక్తిప్రపత్తికళ్, ఉపాయమల్లామైయాలే, నిర్హే తుకమాక కటాక్షిత్తు భవ్యనాక్కిక్కొండు పోరుమ్ పరమకారుణికరాయ్, సదాచార్యరాన ఎమ్బెరుమానార్, "ఇవన్ నమ్ముడైయవ" నెన్రు అభిమానిత్తిరుక్కుమ్ అన్ద అభిమానమే ఇవనుక్కు సంసారోత్తారకమెన్రపడి. ఆచార్యాభిమానమే ఉత్తారకమెన్రు స్తోత్రత్తిల్ ముడివిలే పరమాచార్యరాన ఆళవందారు మరుళిచ్చెయ్ తారితే.**



ఈ సందర్భంలో నడాదూర్ అమ్మాళ్ తమ చరమదశలో అనుగ్రహించిన **"ప్రయాణకాలే చతురః స్వశిష్యాన్ పాదాంతికస్థాన్ వరదోஉభివీక్ష్య, భక్తిప్రపత్తీ యది దుష్కరే వో రామానుజార్యం నమతేత్యవాదీత్"** (అంతిమ ప్రయాణకాలంలో వరదులనబడే నడాదూర్ అమ్మాళ్ తమ శ్రీచరణాల సమీపంలో ఉండే కిడాంబి రామానుజాచార్యులు (అప్పుళ్ళార్) మొదలైన నల్గురు శిష్యులను చూచి భక్తి, "ప్రపత్తులు మీకు ఆచరణసాధ్యాలు కాకపోతే భగవద్రామానుజులే ఉపాయమని నిశ్చయించుకొనండి" - అని అన్నారు) ఇత్యాది వచనాలు స్మరణీయాలు. అంటే- భక్తి, ప్రపత్తులు ఉపాయాలు కావు కనుక, నిర్హేతుకంగా కటాక్షించి, యోగ్యతను కల్గించే గ్రహించే పరమకారుణికులై, సదాచార్యులైన భగవద్రామానుజులు, "ఇతడు మనవాడు" అని అభిమానించే ఆ అభిమానమే చేతనునకు సంసారోత్తారకం- అని భావం. ఆచార్యాభిమానమే ఉత్తారకమనే విషయం **"అకృత్రిమ త్వచ్చరణారవింద ప్రేమప్రకర్షావధి మాత్మవంతమ్, పితామహం నాథమునిం విలోక్య ప్రసీద మద్వృత్త మచింతయిత్వా"** (సహజమైన, నీ చరణారవిందాలలోని భక్తిప్రకర్షయొక్క పరమావధిని కలవారు, అందువల్లనే మహాత్ములైన నా పితామహులు నాథమునులను చూచి, నా వర్తనను లెక్కించకుండా, నన్ను అనుగ్రహించు) అని స్తోత్రరత్నం చివరలో పరమాచార్యులైన ఆళవందార్‌కూడా పలికారు.

**ఇని, ఇన్ద ఆచార్యాభిమానమ్ తాన్ స్వేతరోపాయంగళుక్కు అంగమో? స్వతంత్రోపాయమో? ఎన్నిల్, ఉభయముమాయిరుక్కుమ్. ఎజ్ఞనే? ఎన్నిల్, మహావిశ్వాసరూపైయాన ప్రపత్తియానతు, కర్మజ్ఞానభక్తికళాకిఅ ఉపాయాంతరం గళుక్కు విచ్ఛేదాపాతక పాపహరత్వేన తదర్థకమాన అంగముమాయ్, "సాధ్యభక్తిస్తు సా హంత్రీ ప్రారబ్ధస్యాపి భూయసీ" (ప్రపన్నపారిజాతే-ఫలోదయపద్ధతి-175) ఎన్గిఅపడియే అనిష్టనివృత్తి పూర్వకమాన, ఇష్టప్రాప్తిక్కు స్వతంత్రోపాయముమాయిరుక్కు మాప్పోలే, ఇతువుమ్, స్వేతరో పాయజ్ఞళుక్కు, ఉపదేష్టృత్వప్రవర్తకత్వాది**

**కళాలే అంగముమాయ్, "దేవమివాచార్య ముపాసీత", "ఆచార్యవాన్ పురుషో వేద", "ఉపాయోపేయభావేన తమేవ శరణం వ్రజేత్" ఎన్ఱిత్యాదికళిల్ శొల్లుకిఱపడియే, ఇష్టానిష్టప్రాప్తి పరిహారత్తిల్ తనక్కు మేలన్ఱి స్వతంత్రోపాయముమాయిరుక్కుమ్. భక్తిస్వతంత్రో పాయమాయిరుక్క ప్రపత్తిస్వతంత్రోపాయమానాప్పోలే, ఇన్ద ఆచార్యభిమానమాకిఱ చరమప్రపత్తియుమ్, స్వతంత్రోపాయామాయ్ వన్దతు.**

ఇక, ఈ ఆచార్యాభిమానమనే ఉపాయం మిగిలిన ఉపాయాలకు అంగమా? లేక, స్వతంత్రోపాయమా? అని అంటే, ఇది రెండు విధాలుగా- అంటే- అంగోపాయంగా, స్వతంత్రోపాయంగా ఉంటుంది. ఏ రీతిలో ? అంటే, మహావిశ్వాస రూపమైన ప్రపత్తి అనేది, కర్మజ్ఞాన భక్తులనే ఇతరోపాయాలకు విచ్ఛేదాన్ని కల్గించే పాపాన్ని హరించడం ద్వారా ఆ ఉపాయాలకు వర్ధకమై అంగమై ఉంటుంది. **"ఉపాయభక్తిః ప్రారబ్ధ వ్యతిరిక్తాఘనాశినీ, సాధ్యభక్తి స్తు సా హంత్రీ ప్రారబ్ధస్యాపి భూయసీ"** (ఉపాయ భక్తి- సాంగమైన భక్త్యుపాయంలో అవ్యభిచారిణియైన నిష్ఠ- ప్రారబ్ధంకంటే ఇతరాలైన పూర్వోత్తరాఘాలను నశింపజేస్తుంది. గొప్పదైన ప్రపత్తిరూపమైన ఆ సాధ్యభక్తి అయితే - **"తస్మాన్న్యాస మేషాం తపసా మతిరిక్త మాహుః"** అని వేదాంతంలో ప్రసిద్ధమై, ఉపేయాం తర్భూతమైన భక్త్యుపాయంతో కూడా నశించని ప్రారబ్ధకర్మను సైతం నశింపజేస్తుంది) అనే రీతిలో అనిష్టనివృత్తిపూర్వకమైన ఇష్టప్రాప్తికి ప్రపత్తి స్వతంత్రోపాయమైనట్లే, ఈ ఆచార్యాభిమానం కూడా తనకంటే వేఱయిన ఉపాయాలు ఉపదేష్టయై ఉండడం, ప్రవర్తకుడై ఉండడం మొదలైనవానిద్వారా అంగమై, **"దేవమివాచార్యముపాసీత", "స చ పూజ్యో యథా హ్యాహమ్"** ఆచార్యుడు నావలె పూజించదగినవాడు- అనే ఉపబృంహణసూక్తి రీతిలో, **"మనిశర్క్కు త్తేవర్ పోలత్తేవర్క్కుమ్ దేవన్"** (మానవులకు దేవతలు పూజ్యులైనట్లు ఆదేవతలకు కూడా శ్రియఃపతి పూజ్యుడు) అనే భగవానునివలె ఆచార్యుని ఉపాసించాలి) అని, **"ఆచార్యవాన్ పురుషో వేద"** (జ్ఞానానుష్ఠాన సంపన్నుడైన ఆచార్యుని కల్గిన ముముక్షువైన పురుషుడు అర్థపంచజ్ఞానాన్ని



సుస్పష్టంగా తెలిసికొంటున్నాడు) అని, **"ఉపాయోపేయభావేన తమేవ శరణం వ్రజేత్"** (అటువంటి ఆచార్యుని ఉపాయం, ఉపేయం రెండూ అతడే అనే భావనతో శరణు పొందాలి- రక్షకునిగా విశ్వసించాలి) ఇత్యాది ప్రమాణాలలో చెప్పబడినట్లు ఇష్టప్రాప్తికి, అనిష్టనివృత్తికి తనకు మించినది ఇంకొకటి లేని స్వతంత్రమైన ఉపాయమై ఉంటుంది. భక్తి స్వతంత్రోపాయమై ఉండగా, ప్రపత్తికూడా స్వతంత్రోపాయమైనట్లే, ఈ ఆచార్యాభిమానమనే చరమప్రపత్తి కూడా స్వతంత్రోపాయమై ఉంటుంది.

(ఇక్కడ **"తు"** అనే అవ్యయం భక్త్యుపాయం కంటే ఈ ప్రపత్తి అనే ఉపాయానికి గల వైలక్షణ్యాన్ని తెల్పుతుంది. ఇక్కడ, ఆర్త ప్రపన్నులు వివక్షితులు. కనుక, వారికి భగవత్ప్రాప్తి పొందడంలో గల ఆర్తి విశేషమే ప్రారబ్ధకర్మ ఫలంగా గ్రహించి, ఈశ్వరుడు ఆ కర్మలను నశింపజేస్తాడని భావం. **"తదప్రాప్తి మహాదుఃఖ విలీనాశేషపాతకా"** - **"చింతయంతి"** అనే గోపిక ఆ శ్రీకృష్ణుని పొందలేనందున కల్గిన గొప్పదుఃఖాన్ని అనుభవించడంద్వారా, సమస్తమైన పాతకాన్ని అనుభవించడం ద్వారా నశించిన అశేషమైన - సమస్తమైన పాతకాన్ని కల్గినది- అని చెప్పబడిన రీతిలో చింతయంతి అనే గోపికకు భగవత్ప్రాప్తి తాను ఆశించినపుడే లభించలేదనే ఆర్తిరూపంలోని గొప్ప దుఃఖాన్ని అనుభవించడం ద్వారా ఆమె సమస్త పాపాలు నశించిపోయాయని చెప్పబడింది కదా!)

**భక్తిక్కు అంతర్యామి విషయమ్. ప్రపత్తిక్కు అర్చావతారమ్ విషయమ్. చరమప్రపత్తిక్కు భగవదవతారమాన ఎంబెరుమానార్ విషయమ్. ప్రాకృతవిగ్రహ యుక్తరాయ్ ఎழுన్దరుళియిరుక్కైయాలే, సజాతీయబుద్ధి పణ్ణలామ్బడి ఇరుందతే యాకిలుమ్, ఎమ్బెరుమానారిడత్తిలే ఎమ్బెరుమాన్ స్వరూపేణ నిన్ఱు విశేషాధిష్ఠానమ్ పణ్ణుకైయాలుమ్, ఇవ్వర్థత్తై స్వయమేవ అరుళిచ్చెయ్కైయాలుమ్, భగవదవతారమ్ ఎమ్బెరుమానార్ - ఎన్గిఱ అంశత్తిల్ సంశయమిల్లై.**

భక్తికి అంతర్యామి రూపం విషయం. ప్రపత్తికి అర్చారూపం విషయం. చరమప్రపత్తికి భగవదవతార రూపులైన ఎంబెరుమానార్ విషయం. ప్రాకృత

రూపాన్ని కల్గినవారైనందున మనవంటివారే - అనే బుద్ధిని పొందేటట్లున్నా, భగవద్రామానుజులలో భగవానుడు తన స్వరూపంతో నిలచి ఉండి, విశేషమైన అధిష్ఠానాన్ని కల్గి ఉంటాడు. (దివ్యమంగళవిగ్రహంతో వేంచేసి ఉంటాడు) కనుక, ఈ విషయాన్ని భగవానుడు స్వయంగా పల్కినందున భగవదవతారమే భగవద్రామానుజులు- అనే విషయంలో సంశయం లేదు.

**తదుక్తం పాంచరాత్రే భగవతా సేనేశం ప్రతి-**

ఈ విషయాన్ని పాంచరాత్ర శాస్త్రంలో భగవానుడే విష్వక్సేనుని ఉద్దేశించి ఈవిధంగా పలికాడు.

**మమ స్వరూపం సర్వస్మాత్ పరస్య జగదీశితుః ।**
**షడ్విధం పరిపూర్ణా తత్ సేనేశ! పరిపఠ్యతే ॥**

ఓ విష్వక్సేనా ! సర్వస్వామి, సర్వనియంత అయిన నాకు చెందినది, సకల వేదాంతాలలో ప్రసిద్ధమైనది అయిన అసాధారణ దివ్యమంగళ విగ్రహస్థితి- అనేది **"ఇదం పూర్ణమదః పూర్ణమ్"** - అనే రీతిలో జ్ఞానబలైశ్వర్యాది కల్యాణగుణ పౌష్కల్యాన్ని (సమృద్ధిని) కల్గినదిగా ఆఱు ప్రకారాలను కల్గినదిగా శాస్త్రాలలో అంతటా ప్రతిపాదింపబడుతున్నది.

**పరత్వవ్యూహవిభవ మంతర్యామిత్వమేవ చ ।**
**అర్చాచార్యావతారౌ ద్వౌ షాడ్విధ్యం మే ప్రకీర్తితమ్ ॥**

ఆ ఆఱు రీతుల స్వరూపం ఎటువంటిది? అంటే - (1) పరత్వం, (2)వ్యూహం, (3)విభవం, (4) అంతర్యామిత్వమని, (5)"సర్వం పూర్ణం సహోమ్" అనే విధంగా సమస్తకల్యాణ గుణ పూర్తిని కల్గినందున ప్రపత్తికి నియతంగా విషయమైన అర్చావతారం, (6)ఇటువంటి సిద్ధోపాయం కంటే వేఱు కానిది, ఆ ఉపాయానికి చరమావధి అయిన ఆచార్యరూపావతారమని -ఈవిధంగా ఆఱు ప్రకారాలు కల్గినదిగా ప్రతిపాదింపబడింది.

**పూర్వస్మాదపి పూర్వస్మాత్ సులభో హ్యుత్తరోత్తరః ।**
**తేష్వాచార్యావతరణే కారుణ్యం పరిపూరితమ్ ॥**



పరత్వం మొదలుగా చెప్పబడిన ఆఱింటిలో ముందు ముందు చెప్పబడిన ప్రకారాలకంటే, ఉత్తరోత్తరం చెప్పబడిన ప్రకారం సులభమైనది. వాటి అన్నిటిలో, సర్వసులభమైన అర్చావతారంలోనే ఆశ్రిత సంరక్షణమే స్వభావంగా ఉండడానికి తగిన కృప పుష్కలంగా ఉంటుంది.

**జ్ఞానాదిగుణత స్తత్ర విశేషాధిష్ఠితి ర్భవేత్ ।**
**ఆసన్నత్వాద్దయాళుత్వాత్ జ్ఞానిత్వాద్గురుభావతః ॥**

ఆచార్యరూపాన్ని కల్గిన నా చరమావతారం, **"నడమినో నమర్కళుళ్ళీర్"** (భక్తులారా! వెళ్ళి సేవించండి!) అనే విధంగా వెళ్ళి సేవించవలసిన అర్చావ తారంవలె కాకుండా, **"పీతకవాడై పిరానార్ పిరమ కురువాకి వన్దు"** (పీతాంబరధారి అయిన స్వామి పరమగురువై వచ్చి) అనేటట్లు ఆశ్రితులుండే చోటును తానే వెదకి అక్కడికి వచ్చి అనుగ్రహిస్తున్నందున, కర్మానుగుణంగా ఆశ్రయించి సంసారంలో నిలిపే నిరంకుశ స్వతంత్రమైన (భగవానుని) దయవలె కాకుండా, అన్ని రీతులలో ఆశ్రితుని ఉజ్జీవించితీరే నిరతిశయ దయను కల్గి ఉన్నందున, **"జ్ఞానీత్వాత్మైవ మే మతమ్"** -జ్ఞాని అయితే నాకు ఆత్మ- అని నా అభిప్రాయం- అనే రీతిలో జ్ఞానిని ధారకంగా కల్గి ఉన్నందున, అజ్ఞాన నివర్తకుడనే విషయమే స్వరూపంగా ఉన్నందున, ఆ అవతారంలో, జ్ఞానబలైశ్వర్యాది గుణాలను కల్గిన, ముందు తెలుపబడిన అయిదు ప్రకారాలకంటే నా విశేషాధిష్ఠానమైన ఆచార్యావతారం ఎల్లప్పుడు ఉండదగినది.

**ప్రాప్యప్రాపకత్వే ద్వే స్వనిష్ఠే న గుణౌ మతా ।**
**తస్మాన్మత్పాదయుగళం శరణ్యం మోక్షకామినామ్ ॥**

**ఎన్ఱు భగవాన్ తానే అరుళిచ్చెయ్‌తానితే. ఇత్తాలుమ్, ఎమ్బెరుమానార్ తిరువడికళే సంసారోత్తరణో పాయమ్.**

ఆ అవతారంలో, ఉపాయమై ఉండడం, ఉపేయమై ఉండడం- అనే ఈ రెండు నాకు స్వరూపమై ఉంటాయి. ఇవి గుణాలుకావు. కనుక, మోక్షాన్ని

కోరేవారికి ఆచార్యరూపి అయిన నా పాదయుగళమే రక్షకం) అని భగవంతుడు స్వయంగా పలికాడు కదా! దీనివల్ల కూడా  భగవద్రామానుజుల శ్రీచరణాలే సంసారోత్తరణోపాయం (సంసారాన్ని దాటడానికి తగిన ఉపాయం- అని ఈరీతిలో పాంచరాత్రశాస్త్రంలో చెప్పబడింది.

**ఇని, స్వతంత్రనా యిరుప్పానొరు మహాప్రభువై క్కండు కార్యమ్ కొళ్లుమవన్ కార్యమ్ శెయ్కైక్కుమ్, స్వతంత్రనాయ్ శీఱియుదఱి యుపేక్షిక్కైక్కు ముడలా యిరుక్కుమ్. అంద ప్రభుతన్నైయే కాలై ప్పిడిత్తు క్కొళ్లుమళవిల్, అవన్ దయాపరవశనాయ్, ఉదరమాట్టామల్, అప్పోతే కార్యమ్ శెయ్తువిడుమోపాతి, చరణస్థానీయరాన ఎంబెరుమానారై ప్పఱ్ఱినాల్, అవన్ పరమదయాళువాయ్, ఇవన్ కార్యమ్ శెయ్యుమిడత్తిల్ సంశయమిల్లైయిఱే.**

ఇక, స్వతంత్రుడై ఉండే ఒక మహారాజును దర్శించి కార్యాన్ని సఫలం చేసికొనదలచినవాడు. ఆ ప్రభువు చేతులను పట్టుకొంటే, అతడు ప్రసన్నుడై కార్యాన్ని సఫలం చేయవచ్చు. లేక, స్వతంత్రుడై కోపించి పక్కకు గెంటి ఉపేక్షించవచ్చు. ఆ ప్రభువు పాదాలనే పట్టుకొంటే, అతీడు దయాపరవశుడై, కాదనలేక (ప్రక్కకు గెంటలేక), అపుడే ఆకార్యాన్ని చేస్తాడు. అదే రీతిలో భగవంతుని చరణస్థానీయులైన శ్రీరామానుజులను ఆశ్రయిస్తే, అతడు (భగవంతుడు) పరమదయాళువై ఆశ్రితుని కార్యం సఫలం చేయడంలో సందేహం లేదు.

**లోకే చ పాదపతనం పాణిసంగ్రహణాదపి ।**
**దయాహేతుతయా దృష్టమిత్యుక్తం చరణావితి ॥**

**ఎన్నుమ్, "అనతిక్రమణీయం హి చరణగ్రహణమ్" ఎన్నుమ్ శొల్లుకిఱపడియే చరణగ్రహణమమోఘోపాయమిఱే.**

**"ఇరుళ్ తరు మాఞాలమ్"** -అజ్ఞానాన్ని కల్గించే లోకం- కనుక, శరణాగత రక్షణం పరమ ధర్మమని తెలియలేని ఈ లోకంలో కూడా పాదాలను



పట్టుకోవడం అనేది చేతులను పట్టుకోవడం కంటే దయను కల్గించడానికి కారణంగా కన్పిస్తున్నది- అని మంత్రరత్నంలో **"చరణౌ"**-అని చెప్పబడింది.

అని, **"అనతిక్రమణీయం హి చరణగ్రహణమ్"** (అజ్ఞుని మొదలు సర్వజ్ఞుని వరకు గల అందఱికి కాళ్ళను పట్టుకోవడం అనేది వారు కాదనడానికి వీలులేని కారణమై ఉన్నదికదా) అని చెప్పడిన రీతిలో చరణగ్రహణం అమోఘమైన ఉపాయం కదా!

**నంబెరుమాళ్, పెరియతిరువోలక్కమాక ఎழுన్దరుళి యిరుక్క, తిరువడిత్తొழ వందవర్కళ్, ఎమ్బెరుమానారై నోక్కి దండ నిడ, తత్కాలవర్తియాన రాజా, ఎంబెరుమానారై దండ నిట్టు, "ఎల్లారుమ్ పెరుమాళై విట్టు ఉమ్మైయే దండనిడా నిన్టార్కళ్. ఇతుక్కు ప్పొరుళ్ అరుళిచ్చెయ్యవేణు" మెన్న, "ఉమ్ముడైయ పక్కలిలే శిలర్ కార్యమ్ కొళ్లవందాల్, అవర్కళిల్, ఒరువన్, ఉడువరై క్కొండువన్దాన్. ఒరువన్ ఉమ్ముడైయ పాదుకైయై ప్పిడిత్తు నిన్టాన్. ఇతిలే యారుక్కు నీర్ మున్దుఱ కార్యమ్ శెయ్వీర్? ఆరిడత్తిలే యుమక్కు ప్రీతి విళైయుమ్?" ఎన్న, "కాలైప్పిడిత్త వనిడత్తిలే ప్రీతి విళైయు"మెన్న, "అప్పడియే నామ్ నంబెరుమాళుక్కు త్తిరువడి కళాయిరుప్పోమ్! అతనాల్ నమ్మై ప్పఱ్ఱి, నార్క్కు కార్యాంశత్తిల్ ఒరుకుఱైయుమిన్ఱి యిలే యమోఘమాక ఫలిక్కుమ్" - ఎన్ఱరుళిచ్చెయ్తార్.**

నంబెరుమాళ్ గొప్ప సభ చేసి వేంచేసి ఉండగా, ఒకసారి సేవార్థులై వచ్చిన భక్తులు (ముందుగా) భగవద్రామానుజులను దర్శించి, వారికి నమస్కరించారు. అక్కడ అపుడు ఉన్న ప్రభువు శ్రీరామానుజులకు నమస్కరించి "అందఱు భగవానుని విడచి, మిమ్ములనే ముందుగా నమస్కరిస్తున్నారు. దీనికి ఏమి అర్థమేమో తెలుపండి" అని అడిగాడు. అపుడు శ్రీరామానుజులు "మీ దగ్గరకు ఎవరైనా కార్యార్థులై వచ్చినపుడు, వారిలో ఒకడు కానుకను తీసికొని వచ్చాడు. ఇంకొకడు మీ పాదుకలను సేవించి నిలచాడు. అపుడు మీరు ఈ ఇద్దఱిలో ఎవరి కార్యాన్ని ముందుగా సఫలం చేస్తారు? ఎవరిపట్ల మీకు ప్రీతి కల్గుతుంది ?"అని అడిగారు. ప్రభువు "నా పాదాలను

పట్టుకొన్నవాని పట్ల ప్రీతి కల్గుతుంది'' అని అన్నాడు. ''ఆ రీతిలోనే, మేము నంబెరుమాళ్‌కు పాదస్థానీయులమై ఉన్నాము. కనుక మమ్ములను ఆశ్రయించినవారికి కార్యం ఏ కొఱతలేకుండా అమోఘంగా ఫలిస్తుంది'' అని అన్నారు.

**ఉత్తారకమాన ఎంబెరుమానార్ తిరువడికళిల్ సంబంధమ్ దేవతాంతర మంత్రాంతరదోష స్పర్శత్తాలే కలఙ్గి కులైయామల్ సత్తైయుడన్ కిడక్క ప్పెఱిల్, స్వరూపాలంకారమాన తత్త్వజ్ఞానముమ్, అనన్యభక్తియుమ్, అన్యవైరాగ్యముమ్ ఇల్లావిడిలుమ్, మేలంద సంబంధత్తాలే యుండాక్కిక్కొళ్ళలామ్. మృతసంజీవినియాన ఎంబెరుమానారోట్టై సంబంధమ్ నిషిద్ధమష్ఠానాన్వయలేశత్తాలే అవన్ కై విడుమ్బడి కులైన్దాల్, అనర్థమే విళైన్దు, అత్తాల్ జ్ఞానాదికళ్ శిలతుండానాప్పోలే తోన్ఱినొన్ఱాకిలుమ్ ప్రయోజనమిల్లైయామ్. సదాచార్యరాన ఎంబెరుమానారోడు సంబంధమఱ్ఱ జ్ఞానాదికళు మివనుక్కు, అవద్యకరమాయ్ తలైక్కట్టుమ్. అవద్యకరమాకైయావతు- భగవన్నిగ్రహత్తై విళైత్తు యావదాత్మభావి నరకత్తిలే తళ్లివిడు మెన్డపడి.**

ఉత్తారకమైన భగవద్రామానుజ శ్రీచరణాలలోని సంబంధాన్ని, దేవతాంతర- మంత్రాంతర దోషస్పర్శ వల్ల అజ్ఞానాన్ని పోగొట్టుకోకుండా సత్తను కల్గి ఉన్నట్లయితే, స్వరూపాలంకారమైన తత్త్వజ్ఞానం, అనన్యమైన భక్తి, అన్యవైరాగ్యం లేకపోయినా, ఆ సంబంధం ద్వారా వీటిని పొందవచ్చు. నిషిద్ధానుష్ఠానాన్ని చేసినందున, మృతసంజీవిని అయిన భగవద్రామానుజులతో సంబంధం, ఆ భగవానుడు చేయి విడచేటట్లుగా లేకుండా జేసికొంటే, అనర్థమే సంభవించి, అందువల్ల జ్ఞానాదులు కొన్ని కల్గినట్లు ఆపాతతః తోచినా, చివరకు ప్రయోజనం లేదు. సదాచార్యులైన భగవద్రామానుజులతో సంబంధం లేని జ్ఞానాదులు కూడా ఇతనికి అవద్యాన్ని కల్గించేవిగా పర్యవసిస్తాయి. అవద్యాన్ని (దోషాన్ని) కల్గించేవి కావడం అంటే- భగవన్నిగ్రహాన్ని కల్గించి, యావదాత్మ భావిగా (నిత్యంగా) నరకంలో పడదోస్తాయి- అని భావం.



**''ఎంబెరుమానారోడుండాన సంబంధమ్ స్వరూపవికాసహేతు, తదభావమ్ స్వరూపవినాశహేతు" - ఎన్డు వంగిప్పురత్తునంబి వార్తై.**

''భగవద్రామానుజులతో ఉండే సంబంధం స్వరూపవికాసాన్ని కల్గిస్తుంది. ఆ సంబంధం లేకపోవడం స్వరూపాన్ని నశింపజేస్తుంది'' - అని వంగిపు రత్తునంబి అనే ఆచార్యుల సూక్తి.

**మయ్యాచార్యావతారే తు యస్య భక్తి ర్న విద్యతే ।**
**తస్యాత్మనాశ స్సేనేశ ! భవిష్యతి న సంశయః ॥ (విష్వక్సేన సంహిత)**

**ఎన్డు ఎంబెరుమాన్ తానే అరుళిచ్చెయ్‌తానితే.**

''ఓ విష్వక్సేనా! ఆచార్యరూపిగా అవతరించిన నాపట్ల అంటే శ్రీరామానుజుల పట్ల ఎవనికి అయితే భక్తితో కూడిన దాస్యరుచి లేదో, అతనికి **"శేషత్వమిల్లాద పోదు స్వరూపమిల్లై"** అనే రీతిలో స్వరూపనాశం కల్గుతుంది. ఇందులో సందేహంలేదు'' అని భగవానుడే స్వయంగా పలికాడుకదా.

**"శ్రీమల్లక్ష్మణదేశికేంద్ర చరణద్వంద్వాశ్రయాచ్ఛ్రీపతిః**
**మామాదృత్య మహాఫలప్రసవితా జాతో హి రంగేశ్వరః ।**
**తద్దృష్ట్వా మయి రంగనాథరమణీ శ్రీరంగనాయక్యహో!**
**శ్రీరామానుజపాదభాగయమితి ప్రాచీకశత్స్వాం దయామ్" ॥**

**ఎన్డితే నంబిళ్ళై యరుళిచ్చెయ్యుమ్బడి.**

శ్రీవైష్ణవసంపదను కలవారై, లేక భగవదనుభవ కైంకర్యమనే స్థిరమైన సంపదను కలవారై, లేక, మనకు అపేక్షితమైన ప్రాప్యాన్ని అనుగ్రహించడానికి తగిన జ్ఞానాదిసంపదను కలవారై, ఆచార్యకులశిఖామణి అయిన భగవద్రామానుజుల రెండు శ్రీచరణాలను ఆశ్రయించిన బలంవల్ల శ్రియఃపతి అయిన శ్రీరంగనాథుడు, స్వప్నంలో తమ శ్రీచరణాలు రెండు ఉపాయోపేయాలని శ్రీరామానుజులు స్వయంగా నిర్దేశించి చూపిన అదృష్టాన్ని కల్గిన నన్ను విశేషంగా

కటాక్షించి, నిత్యకైంకర్యమనే గొప్ప పురుషార్థాన్ని ఇచ్చేవాడయ్యాడు కదా! అటువంటి శ్రీరంగనాథుని అభిప్రాయాన్ని గమనించినది, (సంశ్లేషదశలో ఈశ్వరుని, విశ్లేషదశలో జీవుని సంస్కరించి, చేతనరక్షణ వేలి యాత్రగా స్వభావంగా కల్గి ఉన్నందున) శ్రీరంగనాథునకు ఆనందాన్ని కల్గించేదిగా ఉన్నందున శ్రీరంగంలోని ఐశ్వర్యానికి అంతటికి ఈశ్వరి అయిన శ్రీరంగనాయకి, ఇతడు (నేను) శ్రీరంగనాథుడు తానే కోరి ఉభయవిభూతుల రూపంలోని ఐశ్వర్యాన్ని ఇచ్చే రీతిలోని జ్ఞానాది గుణసంపదను కల శ్రీరామానుజుల శ్రీచరణాలను ఆశ్రయించాడు - అని నా విషయంలో తనకు అసాధారణమైన "పాపానాం వా శుభానాం వా... కార్యం కరుణ మార్యేణ" అనే రీతిలో అజ్ఞ- విశేషజ్ఞులందఱు ఉజ్జీవించే రీతిలోని నిర్హేతుక కృపను పరిపూర్ణంగా వ్యక్తం చేసింది. "ఎన్నై ప్పువియిల్ ఒరు పొరుళాక్కి"- (భూమిలో నన్ను ఒక వస్తువుగా చేసి) అనే రీతిలో శ్రీరామానుజులు చేసిన ఈ మహోపకారం ఎంత ఆశ్చరకరం ! - అని నంబిళ్ళై అనుగ్రహించారు.

**అతావతు- "ఎంబెరుమానారుడైయ తిరువడికళిల్ సంబంధముడై యవనన్రో" ఎన్రు పెరియపెరుమాళ్ ఎన్నై యాదరిత్తు, "అన్దమిల్ పేరిన్బత్తు అడియరోడిరున్దమై" (తిరువాయ్-10-9-11) యాకిఱ మహాఫలత్తై త్తరువారాక వొరుప్పట్టార్. అత్తై ప్పెరుమాళుక్కుపత్నియాయ్, ఇనియ విషయామాయిరుక్కిఱ శ్రీరంగనాయ్చ్చియార్ కండు, "ఎంబెరుమానార్ తిరువడికళిల్ సంబంధముండాన సిన్బు తత్సదృశమాక క్కొడుక్కలావతితు వన్రు, వేఱు తకుతియాయిరుప్పతొరు ఫలమ్ కొడుక్కవేణుమ్" - ఎన్రు నినైత్తు, క్కాణామైయాలే, తమ్ముడైయ నిర్హేతుకమాన కృపైయై, ఎన్పక్కలిలే ఒరుమడైయాక వెళియిట్టాళ్. ఇతెన్న వాశ్చర్య మెన్రు కణ్డరుళినారెన్రపడి.**

"శ్రీరామానుజుల శ్రీచరణాలతో సంబంధాన్ని కలవాడుకదా! - అని నన్ను శ్రీరంగనాథుడు ఆదరించి, "అన్దమిల్ పేరిన్బత్తు అడియరోడిరున్దమై" (అంతంలేని మహానందాన్ని పొందే దాసులతో కలసి ఉండడం)- అనే మహాఫలాన్ని అనుగ్రహించడానికి సిద్ధపడ్డాడు. దీనిని, శ్రీరంగనాథునకు పత్నియై



ఆస్వామికి మిక్కిలి ఇష్టురాలైన శ్రీరంగనాచ్చియార్ చూచి, "శ్రీరామానుజుల శ్రీచరణ సంబంధాన్ని ఇతడు కల్గి ఉన్నాడు కనుక, దానికి తగినట్లుగా ఇచ్చే ప్రాప్యం ఏతావన్మాత్రం కాదు. వేఱు యోగ్యమై ఉండే వేఱు ఫలాన్ని ఇవ్వాలి'' అని భావించి చూచి, ఆ విధంగా వేఱొక ఫలం ఏదీ కన్పించనందున, తన నిర్హేతుక కృపనున నాపట్ల కురిపించింది. ఇదేమి ఆశ్చర్యం! - అని ఈ నమ్బిళ్ళైసూక్తిలోని భావం.

**ఇత్తాల్ ఎంబెరుమానారోడు సంబంధముండాకవే, పిరాట్టియుమ్, ఎంబెరుమానుమ్ ఒరువర్ క్కొరువర్ పఱిన్దు మేల్విழுవార్కళ్ ఎన్రు మర్థమ్ శొల్లప్పట్టతు. నిర్హేతుకమాక విషయీకరిక్కుమ్ పరమకారుణికరాన ఎంబెరుమానార్ "ఇవన్ నమ్ముడైయవన్" ఎన్రు అభిమానిక్కుమభిమానమే సంసారోత్తారక మెన్రు సారార్థచతుష్టయవివరణత్తిల్ అమ్మంగియమ్మాళుక్కు ఎజ్గళాழ்వాన్ తాము మరుళిచ్చెయ్తారిఱే.**

ఇందువల్ల భగవద్రామానుజుల సంబంధం ఉంటే, భగవానుడు, లక్ష్మీదేవి ఒకరికి మించి ఒకరు తహతహతో ముందుకువచ్చి అనుగ్రహిస్తారనే విషయం చెప్పబడింది. ''నిర్హేతుకంగా అనుగ్రహించే పరమకారుణికులైన శ్రీరామానుజులు "ఇతడు మనవాడు'' అని అభిమానించే అభిమానమే సంసారోత్తారకం''- అని సారార్థచతుష్టయ వివరణమనే గ్రంథంలో ఎజ్గళాழ்వాన్ అమ్మంగియమ్మాళ్ అనే ఆచార్యులకు తాము తెల్పినట్లుగా తెలియజేశారు.

**సోమాశి యాండానుమ్, "భగవత్ప్రవృత్తివిరోధిస్వప్రవృత్తిసాధ్యాయా భక్తేః స్వాతంత్ర్య రూపాహంకారజనకత్వాత్, భగవంత ముపేత్య తచ్చరణావిందయుగళ శరణాగతే రపి నిరంకుశైశ్వర్య భగవత్స్వాతంత్ర్యస్మరణద్వారా భీతిహేతుత్వాచ్చ, తదుభయ విషయభగవదవతారభూతపరమకారుణిక రామానుజయోగి చరణార విందశరణాగతిరేవ సర్వోజ్జీవనాయ భవతీతి సమర్థితమ్" ఎన్రు స్వప్రణీతమాన చరమోపాయవివరణత్తిలే అరుళిచ్చెయ్తారిఱే.**

సోమాశియాణ్డాన్ అనే పూర్వాచార్యులు కూడా చరమోపాయవివరణమనే గ్రంథంలో "స్వామియై, స్వతంత్రుడైన భగవంతుడు తన సొత్తు. పరతంత్రుడైన జీవుని పొందగోరడమనే భగవత్ప్రవృత్తికి ప్రతిసంబంధి అయినది, స్వప్రయత్న రూపమైన ప్రవృత్తివిశేషం ద్వారా సాధింపబడేది, కర్మజ్ఞానసహకృతమైనది భక్తియోగం. ఇది స్వాతంత్ర్యరూపమైన అహంకారాన్ని కల్గిస్తుంది. (అనగా- శ్రీభాష్యంలో తెలుపబడిన రీతిలో వివేకవిమోకాదులనే నియమాలను కలవాడై ఆయా వర్ణాలకు ఆయా ఆశ్రమాలకు విధింపబడిన కర్మలను తాను అనుష్ఠించిన తరువాత "ధ్రువాऽనుస్మృతిః" - నిరంతరస్మృతి నిలుకడగా నిలుస్తుంది- అనే రీతిలోని భక్తియోగాన్ని స్థిరంగా నిలుపుకోవలసి ఉన్నది. అందువల్ల ఈ భక్తియోగంవల్ల స్వస్వాతంత్ర్యరూపమైన అహంకారం కల్గుతుంది.) భగవానుని దరి చేరి,ఆ స్వామి శ్రీచరణపద్మాలు రెండిటిలోను చేయబడే, వేఱొక ఉపాయాన్ని విడచిపెట్టడం అనే అంగంతో కూడిన ప్రపత్తిలో కూడా, బంధమోక్షాలు రెండిటికి తనకు మించిన నిర్వాహకుడు లేని భగవానునకు ఉండే, కర్మనిబంధనంగా సంసారంలో పడదోయగల, కరుణానిబంధనంగా ముక్తునిగా చేయగల నిరంకుశ స్వాతంత్ర్యం యొక్క స్మరణచేత భీతి కల్గుతుంది. దానివల్ల సందేహం కల్గుతుంది. అందువల్ల ఈ రెండు అంటే- భక్తిప్రపత్తులు రెండు సాధనాలు కావు. ఆ భక్తి ప్రపత్తులకు రెండిటికి విషయభూతుడైన భగవానుని అవతారవిశేషమైనవారు, బంధమోక్షాలు రెండిటికి సాధారణులై ఉండడం కాకుండా, మోక్షైకహేతువైనవారు, అందువలన భగవానుని కంటే పరమకారుణికులైన,(ఇక్కడ యోగిపదం శుభాశ్రయమైన భగవానుని దివ్యరూపాన్ని తమ మనస్సులో సదానిలుపుకొని ఉండడం తెల్పుతుంది.) శ్రీరామానుజుల చరణారవింద ద్వయంలో చేయబడే ప్రపత్తియే అజ్ఞ విశేషజ్ఞ విభాగం లేకుండా అందటి ఉజ్జీవనానికి సాధనమనే విషయం నిర్వహింపబడింది)- అని పలికారు.

(ఈ సందర్భంలో ప్రాసంగికంగా గమనించదగిన కొన్ని అర్థవిశేషా లున్నాయి. "**స్వస్వాతంత్ర్య భయత్తాలే భక్తి నళువిఱ్ఱు**"- స్వస్వాతంత్ర్య భయంవల్ల భక్తి తొలగిపోయింది - అనే సూక్తిరీతిలో భక్తియోగం తొలగిపోయి



నపుడు ఆ భక్తియోగానికి సాధకాలైన వివేకవిమోకాదులు, వాటితో సాధింపబడే భక్తియోగంతోపాటుగా అవి స్వస్వాతంత్ర్యరూపమైన అహంకారాన్ని కల్గిస్తాయని ఈ చరమాధికారికి త్యాజ్యాలు కావా ? అంటే, కావు. "**ఇవన్ తాన్ ఇవైతన్నై నేరాక విట్టిలన్**" అనే క్రమంలో ఇవి అన్నీ ప్రపన్నుకు ప్రాప్యస్థానమైన శ్రీరామానుజులు ముఖవికాసం అనే ఉపేయానికి శేషమై, అందువల్ల వారి విషయంలో "**ధ్యాయేజ్జపేన్నమేద్భక్త్యా భజే దభ్యర్చయేన్ముదా**" అని శాస్త్రాలలో విధింపబడిన, నిరవధిక ప్రేమరూపమైన ధ్రువానుస్మృతి అనే భక్తియోగానికి ప్రతిదినం అతిశయాన్ని కల్గిస్తాయి కనుక, ఇవి చాలా ఉద్దేశ్యాలై ఉంటాయి. ఈ విషయాలు- "**జ్ఞానానుష్ఠానఙ్గళ్ ఇరణ్డుమ్ అల్లాదార్క్కు ఉపాయఙ్గళా యిరుక్కుమ్, ఇవనుక్కు ఉపేయాంగమాయిరుక్కుమ్**" జ్ఞానానుష్ఠానాలు రెండు మిగిలిన వారికి ఉపాయాలు. ప్రపన్నాధికారికి ఉపేయాంగాలు. ఇత్యాదిగా ఈ విషయం శ్రీవచనభూషణంలో తెలుపబడిన వైనాన్ని గమనించాలి.

ఈసూక్తిలోని భగవచ్ఛబ్దం ప్రపత్తికి నియతవిషయమైన అర్చావతారాన్ని తెల్పుతుంది. ఆ అర్చావతారం "**పూర్ణమ్**" అనేరీతిలో ఆశ్రయణ సౌకర్యాపాదకా లైన, ఆశ్రితకార్యాపాదకాలైన గుణాలన్నిటిని ఏ తేడాలేకుండా కల్గి, సకలకల్యాణగుణపూర్ణమనే అర్థాన్ని ఈ భగవచ్ఛబ్దం సూచిస్తుంది.)

**వాదికేసరి అழகియమణవాళ చ్చీయరుమ్ -**

**"పారతంత్ర్యం స్వరూపం హి సర్వజీవాత్మనామపి ।**
**తద్విరుద్ధా హి భక్తిస్తు జీవయత్నాభిలాషిణీ ॥**

వాదికేసరి అழகియమణవాళ చ్చీయర్ "**చరమగురు చరితై**" అనే తాము రచించిన గ్రంథంలో ఈ విధంగా తెలియజేశారు.

బద్ధులు, ముక్తులు, నిత్యులు - అనే మూడు విధాలైన ఆత్మవర్గానికి జ్ఞానానందాలకంటే ఈశ్వరపారతంత్ర్యం అనేది అంతరంగలక్షణం కదా. "**ఒన్ఱి నిన్ఱు తవమ్ శెయ్‌దు**", "**పున్బులవழி యడైత్తు**" అనే పాశురంలో తిరుమழி

శైష్విరాన్ పల్కిన రీతిలో చేతనుని ప్రయత్నాలను అపేక్షించేది, పర్వక్రమంలో పరభక్తి పరజ్ఞాన పరమభక్తుల రూపంలో సాధింపబడేది అయిన భక్తియోగం అయితే ఆ ఈశ్వరస్వాతంత్ర్యరూపమైన జీవస్వరూపానికి విరుద్ధం కదా.

**త్యాగో నివృత్తిసాధ్యోఽయం నిర్మలానంతశాయినః।**
**స్వాతంత్ర్యస్మృతిమాత్రేణ భీతిహేతు ర్భవిష్యతి ॥**

**"శిఱ్ఱవేణ్డా"** (భయపడవద్దు) అనే సూక్తి రీతిలో భగవత్ప్రవృత్తికి విరోధి అయిన స్వప్రయత్నం ద్వారా సాధింపబడేదైన ఈ ప్రవృత్తి కూడా అఖిలహేయప్రత్యనీకుడు, ఆదిశేషునిపై పరుండిఉండేవాడైన భగవానుని నిరంకుశస్వాతంత్ర్యాన్ని స్మరించిన మాత్రంలోనే ఫలం కల్గుతుందా ? లేదా? అనే సంశయరూపమైన భయానికి కారణం అవుతున్నది.

(ఇక్కడ "అయమ్" అనే సర్వనామపదాన్ని ప్రయోగించినందున, దానిద్వారా ప్రపత్తి అనే ఉపాయం సకలవేదవేదాంతాలలో ప్రసిద్ధినిపొందినదని, ధర్మజ్ఞరుచిపరిగృహీతమని, శరణ్యుడైన భగవానుని హృదయానుసారి అని, చేతనుని పారతంత్ర్య స్వరూపానికి ఉచితం కాదని- ఇత్యాది అర్థాలు సందర్భాను గుణంగా స్ఫురిస్తాయి.

ఈ శ్లోకంలో "నిర్మల"అనే పదం ద్వారా **"అనశ్నన్ అన్యో అభిచాకశీతి"** అనే శ్రుతిలో చెప్పబడే చేతనగతదోషాలు ఈశ్వరునకు సంక్రమించవు- అనే విషయం తెలుపబడింది. శ్రుతివాక్యంలో **"అభిచాకశీతి"** అని ఉన్నందున తదనుగుణంగా ఇక్కడ ఇక్కడ "నిర్మల"శబ్దం ద్వారా అఖిలహేయ ప్రత్యనీకుడనే అర్థం స్ఫురిస్తుంది. ఈ విధంగా ప్రకాశించే ఈశ్వరుడే జీవునితో ఏకతత్త్వమనే రీతిలో కలసి ఉన్నా, **"తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి"** అని ఆ శ్రుతిలోనే చెప్పబడిన రీతిలో జీవుడు కర్మఫలాన్ని అనుభవించేటపుడు, భగవానుడతనిని చూచి "తన కర్మఫలాన్ని తాను అనుభవిస్తున్నాడు'' అని ఉపేక్షిస్తాడు, కనుక, "నిర్మల" అనే గుణం కూడా భగవానుని స్వాతంత్ర్య



భయానికి హేతువు అవుతుంది. ఇక, "అనంత శాయినః" అనే పదంలోని అర్థాన్ని పరిశీలించినపుడు, నారదభగవానుడు మొదలైనవారిని సైతం **"గచ్ఛ నారద! మా చిరమ్, ఏకాగ్రా శ్చింతయేయు ర్మాం నైషాం విఘ్నో భవేదితి"** - నారదా! ఇక్కడ ఎక్కువ సేపు ఉండకు. వెళ్ళిపో. వీరు నన్ను ఏకాగ్రతతో ధ్యానిస్తున్నారు. వీరి ధ్యానానికి భంగం కలుగకూడదు- అని ప్రేమ లేనివానివలె నిషేధించే రీతిలో నిత్యనిరవద్యనిరతిశయప్రేమను కలవారై, అస్థానే భయశంకను కల్గినవారికి తన దివ్యమంగళవిగ్రహానుభవాన్ని, సర్వస్వదానంగా అనుగ్రహించే రీతి స్ఫురించినందున, అనాదికర్మకు పరవశులై, భగవత్ప్రేమగంధాన్ని ఎంతమాత్రం లేని మనలను **"క్షిపామి"** అని పక్కకు గెంటివేయడానికి హేతువై ఉండే స్వాతంత్ర్యంవల్ల భయం కల్గుతుందనేది సిద్ధం. ఇంతేకాక, పరతంత్రశేషియై, మోక్షైకహేతువైన ఆచార్యావతారానికి జన్మస్థానమైన ఆదిశేషుడుకూడా భగవత్ప్రేమపరవశుడై, అస్థానే భయశంకను పొంది, **"దహ్యమానా వనం తస్య విషజ్వాలాభిరేవ చ"**- అనంతుని విషజ్వాలచే దహింపబడేవారు - అని చెప్పబడినట్లు క్షీరాబ్ధినాథుని దరిచేరగోరిన మధుకైటభులనే అసురులను తన విషజ్వాలలతో రూపుమాసి పోయేటట్లు చేసిన వృత్తాంతాన్ని తెల్పుతున్నందున "అనంతశాయినః" అనే ఈ పదం కూడా మిక్కిలి భయహేతువు. **"వధ్యతా మేష దండేన తీవ్రేణ సచివై స్సహ, రావణస్య నృశంసస్య భ్రాతా హ్యేష విభీషణః"** (మంత్రులతోపాటుగా ఇతడు తీవ్రమైన దండనతో వధింపబడాలి ఎందుకంటే, ఈవిభీషణుడు, నృశంసుడైన రావణుని సోదరుడు కదా) అని కదా భగవానునిపై అతిశయించిన ప్రేమనుకలవారి అభినివేశం ఉంటుంది. ఈ ప్రసంగంలో వృత్తాంతం ఉదాహరింపబడుతున్నది.

శ్రీనారదమహర్షి శ్వేతద్వీపానికి విచ్చేసిన దివ్యపురుషులను సేవించి, వారి సమీపంలో నిలచి ఊర్ధ్వబాహుడై, సమాహితచిత్తుడై, భగవానుని శ్రీమహాపురుషస్తవమనే పరమరహస్యమైన స్తోత్రాలతో కీర్తించాడు. అపుడు సర్వేశ్వరుడు ఆ మహర్షికి తన విశ్వరూపాన్ని అనేక వర్ణసంస్థానాలతో అత్యంతం

విచిత్రంగా దర్శింపజేసి, "ఏకతద్విత్రితులకుకూడ దర్శించడానికి సాధ్యం కాని ఈదివ్యరూపాన్ని నీవు ఏకాంతిసత్తముడవు కనుక చూడగలిగావు. ఇక, ఇక్కడ ఉండే దివ్యపురుషుల భక్తిపారవశ్యాన్ని చూస్తే, నీభక్తి గోష్పాద పరిమితిలోనిది- అని అనవలసి ఉన్నది. కనుక, వీరి ధ్రువానుస్మృతికి అవరోధం లేనట్లు నీవిక్కనుండి శీఘ్రంగా బయలుదేరి వెళ్ళిపో-అని అన్నాడు. అనే శ్రీమహాభారతం -శాంతిపర్వంలోని- మోక్షధర్మపర్వంలో 339, 340వ అధ్యాయాలలో తెలుపబడిన వృత్తాంతం "అనంతశాయినః" అనే పదప్రయోగానుగుణంగా ఇక్కడ స్మరణీయం.)

**తస్మాద్భక్తిం ప్రపత్తిం చ విహాయ విమలాశయాః ।**
**అస్మదార్యా మహాత్మాన స్సదార్యచరణాశ్రయాః ॥**

అందువల్ల పరిశుద్ధమైన అంతఃకరుణను కల, సర్వజ్ఞులై ఉండే మన పూర్వాచార్యులు స్వరూపవిరుద్ధమైన భక్తియోగాన్ని, "**ప్రపత్త్యుపాయత్తుక్కు ఇక్కుఱ్ఱజ్గళ్ ఒన్ఱుమిల్లై**"- (ప్రపత్తి ఉపాయానికి ఈ దోషాలేమీ లేవు)- అనే రీతిలో ప్రపత్తి నిర్దోషమైనది అయినా, ఈశ్వరస్వాతంత్ర్యభయమున్నది కనుక దానిని విడచిపెట్టి, ఆ సిద్ధోపాయం కంటే అన్యం కాని, తచ్చరమావధి అయిన సదాచార్యుల శ్రీచరణాలనే ఉపాయోపేయాలుగా ఆశ్రయించిన వారై, ఆ సదాచార్యునియొక్క "ఇతడు మనవాడు" అనే అభిమానంలో ఒదిగి సంసారసాగరాన్ని దాటుతున్నారు

(ఈ శ్లోకంలోని "విమలాశయాః, మహాత్మానః" అనే రెండు పదాలు "**మనసా తు విశుద్ధేన**" అనే రీతిలో జ్ఞాతవ్యార్థాలన్నీ తెలియడానికి అంతఃకరణశుద్ధియే కారణమనే విషయాన్ని తెల్పుతున్నాయి)

**తత్కృతేనాభిమానేన నిస్తరంతి భవార్ణవమ్ ।**
**లఘూపాయేన లబ్ధవ్యే ఫలే మహతి దేహినామ్ ।**
**గురూపాయ ద్వయాత్కిం వా కర్తవ్యం స్యాన్ము ముక్షుభిః" ॥**

**ఎన్ఱు చరమగురుచరిత్తైయిలే యరుళిచ్చెయ్‌తారిఱే.**



మోక్షవిరోధి అయిన ప్రకృతి (దేహం)తో కూడి, దానికి పరతంత్రంగా ఉండే చేతనవర్గానికి "**ఫలమత ఉపపత్తేః**" (భగవంతునివల్లనే ఫలం కల్గుతున్నది, ఆవిధంగానే చెప్పడం పొసగుతుందిగనుక), అని చెప్పబడిన రీతిలో భగవంతునివల్లనే సిద్ధించదగినదై ఉండే వైలక్షణ్యాన్ని కల్గినదైన ధర్మాది సకలపురుషార్థాలకంటే విలక్షణమైనది అయిన కైంకర్యరూపఫలం. కృపామాత్రప్రసన్నులైన సదాచార్యుల అభిమానమనే లఘూపాయంతో పొందదగినదై ఉండగా, ప్రకృతియొక్క దోషాలను తెలిసి, ప్రాప్యరుచి ఉద్బుద్ధమైన అధికారులకు, స్వరూపవిరోధి అనే భయంచేత, ఈశ్వరస్వాతంత్ర్య భయంచేత, దుర్లభాలైన భక్తిప్రత్తుల ద్వారా చేయదగిన కర్తవ్యం ఏముంటుంది? ప్రకృతి పరవశులైనందున ముముక్షుత్వం లేని చేతనులకు కూడా సదాచార్యాభిమానంతో ప్రాప్యం లభించేటపుడు, ముముక్షువులై, సదాచార్యాభిమానంలో ఒదిగి ఉండే ఉత్తమాధికారులకు భక్తిప్రపత్తులలో పనిలేదనే విషయం చెప్పనక్కరలేదు కదా.

**ప్రామాణికాగ్రేసరరాన భట్టరుమ్, "పరమకారుణికస్య పరమగురోర్భగవతః శ్రీమన్నారాయణస్య పుండరీకదళామలాయతేక్షణముఖకమలవికాస హేతుభూతం హి భగవద్రామానుజచరణారవింద శరణవరణమ్ తస్మాత్తదేవాస్మాక ముజ్జీవనాయాల మిత్యస్మత్తాతపాదా మేనిరే" ఎన్ఱు ఆ*ల్ర్వా*నుడైయ సిద్ధాంతమాక గురుప్రభావదీపికైయిలే అరుళిచ్చెయ్‌తార్.**

ప్రామాణికులలో గొప్పవారైన భట్టర్‌కూడా "గురుప్రభావదీపిక" అనే గ్రంథంలో ఈక్రింది విధంగా పలికారు. "**ఈశ్వరస్య చ సౌహార్దమ్**" అనే రీతిలో ఆచార్యప్రాప్తికి కూడా ప్రథమహేతువు తానే అయినందున గొప్ప కారుణికుడై, "**లక్ష్మీనాథ సమారంభామ్**" అని పల్కినట్లు గురుపరంపర ఆరంభంలో తనను అనుసంధించవలసి ఉన్నందున పరమాచార్యుడై, అఖిలహేయప్రత్యనీక కల్యాణైకతానుడై, పురుషకారస్వరూపిణి అయిన లక్ష్మీదేవితో నిత్యసంశ్లిష్టుడై ఉండే భగవానునియొక్క తెల్లతామరపూల

దళాలవంటివి, నిర్మలమైనవి, చాలా విశాలమైనవి అయిన నేత్రాలను కల తిరుముఖమనే ఎఱ్ఱ తామరలకు వికాసం కలుగడానికి కారణంగా కదా-**"సర్వకల్యాణసంపూర్ణం సర్వజ్ఞానోపబృంహితమ్, ఆచార్యమాశ్రయేత్"** అనే రీతిలో సమస్తకల్యాణ గుణాలను నిండుగా కలవారు, సమస్తజ్ఞానంతో పూర్ణులైన భగవద్రామానుజుల శ్రీచరణాలలో చేసే శరణాగతి ఉంటుంది. (దీనివల్ల భగవద్రామానుజుల శ్రీచరణాలలో చేసే శరణాగతియే శ్రీమన్నారాయణుని ముఖోల్లాసానికి హేతువు- అని తెలిపినట్లయినది) అందువల్ల ఆ శ్రీరామానుజుల శ్రీచరణాలలో చేసే ప్రపత్తియే అస్మదాదుల ఉజ్జీవనానికి పర్యాప్తమైన ఉపాయమని- మా పితృపాదులైన కూరేశులు భావించారు.

**"లక్ష్మణార్య గురుపాదసేవినాం రక్షణాయ ఖలు తత్కృపా పరమ్,**
**యత్ క్షణేన నిజముఖ్యమానితాం వృత్క్షిణోతి. ఫలరీతిత్త్వతః"**

**ఎన్ఱు పూర్వర్కళ్ శొల్లుమ్ ముక్తకమితే.**

భగవద్రామానుజులు, నిర్హేతుకమైన తమ ఆశ్రితవాత్సల్యమే కారణంగా, తమను ఆశ్రయించిన ఆచార్యులకు విద్యామదధనమద అభిజనమదాలనే మూడు మదాలున్నందున కలిగే అనర్థం, అవి లేనందువల్ల కలిగే మంచి ఫలం- అనే వీటియొక్క యాథాత్మ్యజ్ఞానాన్ని కలిగించి, క్షణమాత్రంలోనే ఆ దోషాలను సవాసనగా పోగొడుతున్నారు. అందువల్ల **"ఆచార్యో వేదసంపన్నో విష్ణుభక్తో విమత్సరః"** ఇత్యాదిగా నిర్వచింపబడిన సదాచార్యలక్షణో సంపత్తిని కలవారై, అజ్ఞాననివర్తకులై ఉండే ఉత్తారకులైన భగవద్రామానుజుల శ్రీచరణాలు ఉపాయంగా ఆశ్రయించినవారి రక్షణకోసంగా కదా ఆ రామానుజుల కృప ఉన్నది. ఈ విధంగా స్వరూపశోధనం మొదలు అన్నీ శ్రీరామానుజుల కృపవల్లనే కల్గుతున్నందున ప్రాప్యసిద్ధికి వారి శ్రీచరణాలే సాధనమనే విషయం కింపునర్న్యాయసిద్ధం - అని పూర్వాచార్యులు పలికిన ముక్తకం.



(ఈ శ్లోకంలో, శ్రీరామానుజులు- **"విద్యమదో ధనమద స్తథైవాభిజన మదః"** అనే మదత్రయాన్ని సవాసనంగా పోగొట్టే విషయం తెలుపబడింది. దీనిద్వారా వారే రక్షకులనే విషయం స్పష్టం చేయబడింది. శ్లోకంలోని **"తత్కృపా, పరమ్"** అనే పదాలద్వారా శ్రీరామానుజుల కృపయే వారిని ఆశ్రయించినవారికి గొప్ప రక్షకమని, **'ఖలు'** అనే అవ్యయంద్వారా ఈ అర్థంయొక్క ప్రసిద్ధి తెలుపబడింది. అందువల్ల, ఆచార్యప్రాప్తికి పూర్వత భావి అయిన అద్వేషాదులు మాత్రమే భగవత్కృపవల్ల కల్గుతుంది. తప్ప ఆచార్యప్రాప్తికి తరువాత **"శెయల్ నన్ఱాక తిరుత్తి"** (చేసే పనిని, వర్తనాన్ని చక్కగా సరిదిద్దడం) ఆచార్యుల కృత్యమని తెలుపబడింది. **"ఆశారియన్ శిచ్చన్ ఆరుయిరై ప్పేణుమవన్"** (ఆచార్యుడు శిష్యుని అమూల్యమైన ఆత్మను ఆదరించాలి) అని చెప్పబడింది కదా! శ్రీరామానుజులు ముదలియాణ్డాన్‌ను తామే దిద్దుబాటు చేయడమేకాక, తిరుక్కోట్టియూర్ నంబిని పురస్కరించుకొని స్వరూపశిక్షను అనుగ్రహింప జేశారు శ్రీరామానుజులనున అనుసరించి కూరేశులు సైతం పిళ్ళైపిళ్ళైయాళ్వాన్ అనే ఆచార్యులను సంస్కరించారు. **"తిరుత్తి త్తిరుమకళ్ కేళ్వనుక్కు ఆక్కి"** (సంస్కరించి శ్రియఃపతికి దాసులుగా చేయడం) కంటే తదీయులకు, వారు చాలా ఆదరించే ఆచార్యులకు ఇష్టవినియోగార్హంగా ఉండేటట్లు చేయడం చాలా ఉద్దేశ్యం. భగవానుడు కూడా **"అడియార్క్కు ఎన్నై ఆట్పడుత్తి"** అనే రీతిలో తమ భక్తులకు శేషంగా చేస్తాడు కదా! ఇక, తనను ఆశ్రయించిన భక్తులకు మదత్రయాన్ని సవాసనగా పోగొట్టినపుడే తప్ప ఆ ఉద్దేశ్యం పూర్తికాదు. అదికూడా భగవానుడే చేయవచ్చుకదా! అంటే, అతడు తన నిరంకుశస్వాతంత్ర్యగుణంతో వీరి పూర్వకర్మలను చూచి **"న క్షమామి"** అని తలచి, **'అవమానక్రియా తేషాం సంహరత్యఖిలం జగత్"** (భగవద్భక్తులను అవమానించడం సమస్తలోకాన్ని నశింపజేస్తుంది) అనే రీతిలో కోపిస్తాడు కనుక, వీరిని సంస్కరించడానికి అంగీకరించడు. ఇటువంటి భగవంతుని హృదయాన్ని గ్రహించి, "వీరిని ఈనిరంకుశ స్వతంత్రుని చేతిలో పెడితే ఏమవుతుందో?" అని భీతిల్లి, కృపామాత్రప్రసన్నులై, వీరిని దిద్దుబాటు చేస్తారు. కనుకనే

“లక్ష్మణార్యగురుపాదసేవినాం రక్షణాయ ఖలు తత్కృపా పరమ్” అని ఇక్కడ చెప్పబడింది.

“స్వవ్యాపారేణ సాధ్యా భజనగతిరియం ప్వానురూపత్వహానాత్
త్యాజ్యా పూజ్యైః ప్రపన్నై శ్శరణవరణితా దేశికై ర్నాప్యుపాత్తా ।
కింత్వాచార్యాభిమానాత్పరమపద మహో! లభ్యతే నాన్యతో న
స్తస్మాద్రామానుజాం ఘ్రిద్వితయ మనుపమం సాధనం భావయామః” ॥

**ఎన్ఱు భక్తిప్రపత్తికళై త్యాజ్యకోటియిలేయాక్కి, ఎంబెరుమానారుడైయ అభిమానత్తాలే పేఱు తప్పాదెన్ఱు తచ్చరణారవిందంగళై ఉపాయమాక అఱుతియిట్టారితే, నాయనారాచ్చాన్‌పిళ్లై యుమ్.**

ప్రకృతంలో నాయనార్ ఆచ్చాన్‌పిళ్ళై సూక్తి ఒకటి ప్రమాణీకరింప బడుతున్నది.

స్వప్రయత్నంద్వారా సాధింపబడే ఈ భక్తిరూపోపాయం భగవత్ పరతంత్రుడైన జీవుని స్వరూపానికి అనుగుణం కానందున, పూజ్యులైన, జ్ఞానాధిక్యంచేత ప్రపన్నులైన, నాథయామున యతివరాదులచే అది త్యజింపబడింది. ఆ విధంగానే మన ఉజ్జీవనాన్ని తమ బాధ్యతగా నిర్వహించే ఆ ఆచార్యులచే భగవచ్చరణారవిందశరణాగతుడై ఉండడం అనేది కూడా ఆచార్యపరతంత్రుడై ఉండే తన (జీవుని) యథార్థ స్వరూపానికి అనురూపం కానందున అంగీకరింపబడలేదు. లేక, శరణాగతిలో (ప్రపత్తిలోవలె) భయాభయాలు రెండు మాఱి మాఱి వర్తించే ప్రసక్తి లేనిదిగా అంగీకరింప బడలేదు (ప్రపన్ననకు భయాభయాలు రెండు మాఱిమాఱి వర్తిస్తాయని భావం. మఱి ఏ ఉపాయం ఆ విధంగా భయాభయాలు రెండు మాటిమాటికి వర్తించనిదిగా ఆచార్యులచే అంగీకరింపబడింది? అంటే -) “ఆచినోతి హి శాస్త్రార్థాన్” ఇత్యాది క్రమంలో పరిపూర్ణుడైన సదాచార్యుని అభిమానంవల్ల “నల్లమన్దమిల్లదోర్ నాడు” అంతులేని ఆనందాన్ని కల అద్వితీయదేశం అయిన



పరమపదం లభిస్తుంది. అని, భగవత్పారతంత్ర్య స్వరూపానికి విరోధి అయిన భక్త్యుపాయం, ఆచార్యపారతంత్ర్యానికి విరోధి అయిన భగవచ్చరణారవింద శరణాగతి - అనే వీటివల్ల లభించదని నిశ్చయించుకున్నాను. ఆహా! **“తమేవం విద్వానమృత ఇహ భవతి, నాన్యః పంథా అయనాయ విద్యతే”**- (ఈవిధంగా పరమాత్మను తెలిసినవాడవుతున్నాడు ముక్తిని పొందే విషయంలో వేఱొక ఉపాయం లేదు) - అని, **“నాహం వేదై ర్నతపసా న దానేన న చేజ్యయా, భక్త్యా త్వనన్యయా శక్యః”**- (అర్జునా! ఇటువంటి నేను కేవల వేదాధ్యయనంవల్ల కాని, కేవల తపస్సువల్ల కాని, కేవలదానంవల్ల కాని, కేవలం యజ్ఞాదులతోగాని లభించడానికి వీలైనవాడను కాను) ఇత్యాది పరశ్శతాలైన శ్రుతిస్మృతులలో చెప్పబడినట్లుగా ‘ఉభయ పరికర్మితస్వాంతస్య” -(కర్మజ్ఞానాలచే సంస్కరింపబడిన మనస్సును కలవానికి) అని, **“ఏవం నియమయుక్తస్య”** అని జ్ఞానానుష్ఠాన పరిపూర్ణుడైన అధికారిచేతనే పొందడానికి వీలయిన పరమపదం ఆచార్యాభిమాన రూపసులభోపాయం ద్వారా లభిస్తున్నదే ! ఎంత ఆశ్చర్యం ! అందుచేత ఆచార్యాభిమానమే ఉత్తారకమైనందున ఆస్మదాదులకు ఉపాయాత్మకమైన ఆచార్యత్వాన్ని కల శ్రీరామానుజుల శ్రీచరణద్వయమే ఇతరోపాయ నిరపేక్షమైన, అందువల్లనే, సాటిలేని సాధనంగా భావిస్తాము)- అని నాయనార్ ఆచ్చాన్‌పిళ్ళైకూడా భక్తి ప్రపత్తులను త్యాజ్యకోటిలోనికి చేర్చి, శ్రీరామానుజుల అభిమానంవల్ల ప్రాప్యసిద్ధి తప్పదని, వారి శ్రీచరణార విందాలను ఉపాయంగా అధ్యవసించారుకదా !

**ఇప్పడి నమ్పూర్వాచార్యర్‌కళనైవరుమ్ ప్రమాణపురస్సరమాక ఎంబెరు మానారిడత్తిలే ఉత్తారకత్వత్తై అఱుతియిట్టు, అవరభిమానత్తిలే ఒదుంగి, “తేవు మఱ్ఱఱియేన్” (కణ్ణినుణ్-2) ఎన్ఱు తదేకనిష్ఠరాయ్ పోన్దార్‌కళితే. ఆకైయాల్, ఎంబెరు మానారోడుండాన సంబంధత్తుక్కు ఇశైయాతే “తొండుక్కే కోలమ్ పూణ్డు” ఎన్గిఅపడియే, కుఴైచ్చి యిడువతుమ్, కుంబిడువతుమాయ్‌క్కొండు, పరభ్రామకరాయ్ త్తిరియుమ్ దుర్మానికళాన కళ్లక్కఴణిమిండర్కు యావదాత్మభావి ఈశ్వరన్ ఫలప్రదనన్ఱిక్కే సంసారసాగరత్తిలే అఴున్దిపోరుంబడి యిట్టువైప్పన్.**

ఇవ్వర్థత్తై, ''ఇరామానుశన్ మన్నుమామలర్తాళ్ పొరున్దా నిలైయుడై పున్మైయినోర్క్కెన్టుమ్ నన్మై శెయ్యా పెరున్దేవరై ప్పరవుమ్ పెరియోరె"న్ఱు (ఇరామానుశ-63) స్పష్టమాక అరుళిచ్చెయ్దారితే,

ఈ విధంగా మన పూర్వాచార్యులు అందఱు ప్రమాణపురస్సరంగా భగవద్రామానుజుల పట్ల ఉత్తారకత్వాన్ని నిశ్చయించుకొని, వారి అభిమానంలో ఒదిగి **"తేవు మఱ్ఱఱియేన్"** (వేఱొక దైవాన్ని తెలియను) అని తదేకనిష్ఠులై వర్తించారు. అందువల్ల, శ్రీరామానుజులతో గల సంబంధాన్ని అంగీకరించ కుండా, **"తొణ్డుక్కే కోలమ్ పూణ్డు"** (అన్యదేవతాసేవకే ప్రయత్నించి) అనే రీతిలో అన్యదైవాలకు నమస్కరించి, ప్రదక్షిణం చేసి, పరిభ్రమించిన చిత్తాన్ని కలవారై దురహంకారాన్ని కల్గిన చోరభ్రష్టులకు యావదాత్మభావిగా భగవానుడు ఫలప్రదుడు కాకపోవడమే కాక, సంసారసాగరంలో మునిగి పడి ఉండేటట్లు పడవేస్తాడు. ఈ అర్థాన్ని **"ఇరామానుశన్ మన్ను మామలర్తాళ్ పొరున్దా నిలైయుడై పున్మైయినోఱ్కు ఎన్టుమ్ నన్మై శెయ్యా పెరున్దేవరై ప్పరవుమ్ పెరియోర్"** (శ్రీరామానుజుల శ్రీచరణాలలో భక్తిలేని నీచులను మంచి చేయమని గొప్ప దేవతలతో సమానులైన శ్రీవైష్ణవులను స్తుతించే మహనీయులు) అని అముదనార్ ఇరామానుశ నూఱ్ఱన్దాదిలో స్పష్టంగా తెలిపారు.

**"యశ్శ్రీలక్ష్మణయోగివర్య చరణద్వంద్వాశ్రయీ నాభవత్**
**తస్యాత్యంత దయాది సద్గుణనిధి ర్నారాయణ శ్రీపతిః।**
**దాతుం ముక్తి మనాదరో భవబృహద్వారాశయే సంతతం**
**నిక్షిప్యైవ హృదాపి నో గణయతి ప్రాక్సిద్ధకర్మేరితః॥**

**ఎన్ఱు నంజీయర్ ఇవ్వర్థత్తై అరుళిచ్చెయ్‌తార్.**

ఏ చేతనుడు, భగవత్కైంకర్యసిరిని కలవారై, శేషావతారసూచకమైన లక్ష్మణార్యనామాన్ని కలవారైన యోగిశ్రేష్ఠులయొక్క ఒకదానికంటే ఇంకొకటి భోగ్యంగా ఉండేవి, పరస్పరసాదృశ్యంలోని అందాన్ని కల్గినవి అయిన రెండు



శ్రీచరణాలను ఆశ్రయించినవాడు కాడో, ఆ చేతనునకు నిరవధిక వాత్సల్యాది కల్యాణగుణ యుక్తుడైన సర్వేశ్వరుడు, పురుషకారభూత అయిన లక్ష్మీదేవి వచనానుసారం వర్తించేవాడైనా, నిరవధిక కృపాదిగుణపూర్ణుడై ఉన్నా, మోక్షాన్ని ఇవ్వడంలో ఆదరాన్ని లేనివాడై, శ్రీరామానుజుల పదాలను ఆశ్రయించని ఆ చేతనుని సంసారమనే పెద్ద సముద్రంలో **"క్షిపామి"** అనే రీతిలో ఏనాటికీ దరిచేరలేనట్లుగా పడదోసి, ''ఇతడు తన అనాదిసిద్ధమైన కర్మచేత ప్రేరితుడై ఈ రీతిలో అధోగతిని పొందాడులే''- అని తలచి ఏనాడూ హృదయంలో భావించడు. "అయ్యో ! ఇతడు ఎంత కష్టపడుతున్నాడు ?'' అని జాలిపడడు అని నంజీయర్ ఈ అర్థాన్ని పలికాడు.

**అతావతు - ఎమ్బెరుమానార్ తిరువడి కళిల్ సంబంధరహితనాయ్, వైష్ణవనెన్ఱు యాతొరుత్తన్ ప్రసిద్ధితోన్ఱ ఇరుక్కిఱాన్, అవనుక్కు నిరవధిక వాత్సల్యయుక్తనాన సర్వేశ్వరన్, పురుషకార భూతైయాన పెరియపిరాట్టియార్ అరుకిలిరుందాలుమ్, దయాదిగుణ పరిపూర్ణనా యిరున్దాలుమ్, మోక్షఫలమ్ కొడామల్ అనాదరిత్తు, యావదాత్మభావి సంసారమాకిఱ పెరుమ్కడలిలే తళ్లియిట్టువైత్తు, "అవన్ తాన్, తన్నుడైయ అనాదిసిద్ధమాన కర్మత్తుక్కు పరవశనాకి, ఇప్పడి అనర్థప్పట్టా" నెన్ఱుకొండు, "ఎన్ శెయ్‌తాన్? ఎన్ పట్టాన్?" ఎన్ఱు తిరువుళ్లత్తాలు మెణ్ణాన్ - ఎన్నపడి.**

ఈ శ్లోకతాత్పర్యం ఏమంటే- భగవద్రామానుజుల శ్రీచరణసంబంధాన్ని లేనివాడై, ''నేను వైష్ణవుడను'' అనే ప్రసిద్ధి స్ఫురించేటట్లుంటాడో, అతనిపట్ల, నిరవధికవాత్సల్య యుక్తుడైన సర్వేశ్వరుడు, పురుషకారభూత అయిన లక్ష్మీదేవి సమీపంలో ఉన్నా, దయాది గుణపూర్ణుడై ఉన్నా, మోక్షఫలాన్ని ఇవ్వకుండా అనాదరించి, నిత్యంగా అతడు సంసారమనే మహాసముద్రంలోకి పడదోసి, ''అతడే తన అనాదిసిద్ధమైన కర్మకు పరవశుడై ఈ రీతిలో అనర్థాన్ని పొందుతున్నాడు'' అని తలచి, 'అయ్యో! ఏం చేశాడు ! ఏమి పాటుపడ్డాడు !'' అని మనస్సులో ఎంతమాత్రం భావించడు- అని.

**ఇప్పడి పరమకారుణికరాయ్, పరమాత్తారకరాన ఎంబెరుమానారభిమానత్తిలే ఒతుఙ్గివర్తిక్కుమ్ వైష్ణవాధికారి, తనక్కు సహవాసయోగ్యరుమ్, సదానుభవ యోగ్యరుమ్, సత్కారయోగ్యరుమ్ ఉండామ్బడి తేడిక్కొండిరుక్కవేణుమ్. ఇల్లైయాకిల్ స్వస్వరూపప్రచ్యుతి వందు, అధఃపతిత్తువిడువన్.**

ఈ విధంగా పరమకారుణికులై, పరమోదారులైన శ్రీరామానుజుల అభిమానంలో ఒదిగి వర్తించే వైష్ణవాధికారి తనకు సహవాస యోగ్యులు, సదానుభవయోగ్యులు, సత్కారయోగ్యులు ఉండేటట్లు అన్వేషించాలి. లేకపోతే అథఃపతనాన్ని పొంది నశిస్తాడు.

**ఇతిల్, సహవాస యోగ్యరాకిఱార్ - మఱువ*గ్రి* చరమపర్వనిష్ఠరాయ్, ఎమ్బెరుమానారుడైయ (గుణప్రతిపాదకమాన) దివ్యసూక్తికళై ప్రసంగిక్కిల్, “ఇవైయుమ్ శిల సూక్తి కళిరున్దపడియే! పావియేన్, ఇవ*గ్రై* యనాదికాల మి*ఴ*న్దు కెట్టేన్” ఎన్ఱు నెంజురుకి యీడుపట్టిరుక్కు మవర్కళ్.**

వీరిలో, సహవాసయోగ్యులంటే- నిష్కళంకమైన చరమపర్వనిష్ఠను కలవారై, భగవద్రామానుజుల దివ్యసూక్తులు ప్రస్తావింపబడినపుడు, “ఆహా ! ఏమి ఈ సూక్తులు ! పాపిష్ఠివాడను ! వీటిని అనాది కాలంగా కోల్పోయానే !” అని మనస్సులో ద్రవించి, అభినివేశాన్ని పొందేవారు.

**సదానుభవయోగ్యరాకిఱార్ - ఎమ్బెరుమానార్ తిరునామత్తై ఉచ్చరియావిడిల్ నాక్కు వ*గ్రు*మెన్ఱు తదేకానుసంధానతత్పరరాయ్, తదుక్తి శ్రవణత్తిల్ ప్రణవరాయ్, స్వరనేత్రాంగవిక్రియై యైయుడైయరాయ్, తద్విషయత్తిల్ ప్రవణరాయిరుక్కు మవర్కళ్.**

సదానుభవయోగ్యులంటే- భగవద్రామానుజుల తిరునామాన్ని ఉచ్చరించలేకపోతే నాలుక పిడచకడుతుంది- అనే రీతిలో తదేకానుసంధాన తత్పరులై, వారి ఉక్తిని వినడంలో ప్రవణులై, స్వరనేత్రాంగ విక్రియాలను కలవారై, వారి విషయంలో ప్రవణులై ఉండేవారు.



**సత్కారయోగ్యరాకిఱార్ - దేహయాత్రై యిల్ ఉపేక్షై పిఱన్దు, ఆత్మయాత్రైయిల్ మిక్క అభినివేశత్తైయుడైయరాయ్, తదీయాభిమానత్తిలే ఒతుఙ్గి, ఎమ్బెరు మానారుడైయ తిరునామానుసంధానత్తాలే మాధూకరమ్ కొండు దేహధారణమ్ పణ్ణి వర్తిక్కుమవర్కళ్. ఎమ్బెరుమానారుడైయ కళ్యాణగుణఙ్గళిలే మగ్నాశయరల్లాతారోడు సహవాసమ్, చరమపర్వాధికారిక్కు అవద్యమాయిరుక్కుమ్. “ఇరామానుశన్ తన్ పిఱంగియ శీర్ శారా మనిశరై చ్చేరే నెనక్కెన్న తా*ఴ్*వినియే” (ఇరామానుశ-16) ఎన్ఱుమ్ అరుళిచ్చెయ్ తువైత్తారిఱే.**

సత్కారయోగ్యులంటే- దేహయాత్రలో అపేక్ష కల్గి, ఆత్మయాత్రలో గొప్ప అభినివేశాన్ని కలవారై, తదీయుల (భగవద్భక్తుల) అభిమానంలో ఒదిగి ఉండి, భగవద్రామానుజుల తిరునామానుసంధానంలో మాధూకరాన్నికల్గి, దేహధారణ చేసేవారు. భగవద్రామానుజుల కల్యాణగుణాలలో మగ్నమైన మనస్సును కలవారై ఉండని వారితో సహవాసం చరమపర్వాధికారికి అవద్యమై ఉంటుంది. ఈవిషయాన్ని అముదనార్ **“ఇరామానుశన్ తన్ పిఱఙ్గియ శీర్ శారా మనిశరై చ్చేరేన్ ఎనక్కెన్న తా*ఴ్*వినియే”** (శ్రీరామానుజుల కల్యాణగుణాల పట్ల ఆసక్తిలేని మానవులతో నేను చేరను. ఇక నాకు ఏమి లోటు?) అని పలికారుకదా !

**ఇవ్వధికారిక్కు క్షణము మిడైవిడామల్ కాలక్షేపత్తుక్కు విషయా మాకిఱతు- “త్వత్ప్రబంధ పరిశీలనైః కాలక్షేపోఽస్తు” ఎన్గిఱపడియే తత్ప్రతిపాదితమాన వేదాంతగ్రంథంగళుమ్, భగవద్గుణానుభవ రూపదివ్యసూక్తికళుమ్. దివ్యసూక్తికళావన - ఆ*ఴ్*వార్కళుడైయ అరుళిచ్చెయల్కళుమ్, తిరుప్పావైయుమ్, పూర్వాచార్యర్ కళరుళ్ అచ్చెయ్త రహస్యంగళుమ్,**

ఈ అధికారికి క్షణంకూడా అంతరాయం లేకుండా కాలక్షేపానికి విషయం ఏమంటే- **“ఆమోక్షం లక్ష్మణార్య ! త్వత్ప్రబంధ పరిశీలనైః, కాలక్షేపోఽస్తు”** (శ్రీరామానుజా ! మోక్షపర్యంతం నాకు దేవరవారి ప్రబంధానుశీలనంతో కాలక్షేపం జరగాలి) అనే రీతిలో వారిచే రచింపబడిన వేదాంతగ్రంథాలు,

భగవద్గుణానుభవ రూపదివ్యసూరి సూక్తులు. దివ్యసూరిసూక్తులు ఏవి? అంటే, ఆళ్వార్ల శ్రీసూక్తులు, తిరుప్పావై, పూర్వాచార్యులు రచించిన రహస్యాలు.

(ఇపుడు, **"ఆమోక్షమ్"** ఇత్యాది శ్లోకం వివరింపబడుతున్నది. ఈ శ్లోకం భగవద్రామానుజుల విషయంగా రచింపబడిన ప్రార్థనాపంచకమనే స్తోత్రం లోనిది. ఇందులో, భగవద్రామానుజులచే ప్రతిపాదింపబడిన శ్రీభాష్యాది వేదాంతగ్రంథాల పరిశీలనంతో కాలక్షేపాన్ని చేయగలగాలి- అని ప్రార్థింపబడు తున్నది. ఈ శ్లోకం తరువాత గల **"పరాంకుశమునీంద్రాది పరమాచార్య సూక్తయః, స్వదంతాం మమ జిహ్వాయై స్వయ మేవ యతీశ్వర!"** (యతీశ్వరా! నమ్మాళ్వార్ మొదలైన దివ్యసూరులైన పరమాచార్యుల సూక్తులు నా జిహ్వకు స్వయంగానే రుచించాలి) అనే శ్లోకంలో దివ్యసూరిప్రబంధాలలో రుచిని ప్రార్థించే స్తుతికర్త, దానికి ముందుగా శ్రీభాష్యాది పరిశీలనాన్ని ఎందుకు ప్రార్థిస్తున్నారు? అంటే, **'వాన్ తికళ్లుమ్ శోలై మదిళరఙ్గర్ వణ్పుకళ్ మేల్ ఆన్ఱ తమిళ్ మఱైకళ్ ఆయిరముమ్ ఈన్ఱ ముదల్ తాయ్ శడకోపన్ మొయ్మ్బాల్ వళర్త్త ఇదత్తాయ్ ఇరామానుశన్"** (ఆకాశాన్ని అంటే తోటలను, ప్రాకారాలను కల శ్రీరంగానికి అధిపతి అయిన శ్రీరంగనాథునిపై రచింపబడినద్రావిడవేదరూపమైన పాశురాల వేయిని ప్రసవించిన తల్లి శఠకోపులు, దానిని చక్కగా పెంచిన తల్లి శ్రీరామానుజులు) అనే తిరువాయ్ మొళ్ళి తనియన్ పాశురంలో శ్రీభాష్యం తిరువాయ్మొళ్ళికి రక్షకంగా చెప్పబడినందున, ముందుగా శ్రీభాష్యాది సూక్తుల పరిశీలనం ప్రార్థింపబడింది. ఇక, ఈ శ్లోక తాత్పర్యం ఏమంటే - అభియుక్తులలో గొప్పవారైన భగవద్రామానుజా ! దేవరవారి అభిమానంలో ఒదిగి ఉండే సత్పురుషులతో సహవాసాన్ని పొందిన మాకు దేవరవారిచే రచింపబడిన శ్రీభాష్యాది వేదాంతగ్రంథాల పరిశీలనతో - అంటే - ఆగ్రంథాలలో నిశ్చయింపబడిన అర్థాలలో - ఏదీ లోపించని రీతిలో మాటిమాటికి సేవించే క్రమంతో కాలక్షేపం జరగాలి. ఈ విధంగా ఎంతకాలం? అంటే, మోక్షం కలిగే పర్యంతం కలగాలి - అని.)



**ఇని, ఇన్దచరమాధికారిక్కు నాలునిలైయుండు. అతావతు - స్వరూపజ్ఞాన మెన్గుమ్, స్వరూపనిష్టై యెన్గుమ్, స్వరూపయాథాత్మ్యజ్ఞాన మెన్గుమ్, స్వరూప యాథాత్మ్యనిష్టై యెన్గుమ్ నాలువకైయా యిరుక్కుమ్.**

ఇక, ఈ చరమాధికారికి నాల్గు దశలున్నాయి అవి- స్వరూపజ్ఞానం, స్వరూపనిష్ఠ, స్వరూపయాథాత్మ్యజ్ఞానం, స్వరూపయాథాత్మ్యనిష్ఠ- అని అవి నాల్గు రీతులలో ఉంటాయి.

**ఇవఱ్ఱిల్ - స్వరూపజ్ఞాన మావతు - భగవత్పరతంత్రమా యిరుక్కిఱ అసాధారణాకారత్తై ఎవ్వళి యాలుమ్ సత్తై కులైయామల్ నిన్గుణర్న్దు, అతుతాన్ తదీయపర్యంతమాకావిడిల్ కులైయు మాకైయాలే, ఎమ్బెరుమానారుక్కుమ్, తదీయర్క్కుమ్, అత్యంతపరతంత్ర మాయిరుక్కు మెన్ఱఱుతియిట్టు, తదేకనిష్ఠరాయిరుక్కు మిరుప్పై యుళ్లపడి యఱికై.**

వీటిలో (1) స్వరూపజ్ఞానమంటే- భగవత్పరతంత్రమై ఉండే అసాధారణాకారాన్ని ఏ రీతిలోను సత్త కోల్పోకుండా స్థిరంగా తెలిసికొని, అది తదీయపర్యంతం అనువర్తించకపోతే నశించిపోతుంది కనుక, భగవద్రామా నుజులకు, వారి భక్తులకు అత్యంత పరతంత్రమై ఉన్నదని గ్రహించి తెలిసికొని, తదేకనిష్ఠులై ఉండే స్థితిని యథాతథంగా తెలియడం.

**స్వరూపనిష్టైయావతు - ఇష్టవినియోగార్హ స్వరూపమాన తదీయశేషత్వమ్ "అకించిత్క రస్య శేషత్వానుపపత్తిః" ఎన్గిఱపడియే కించిత్కార మిల్లాతపోతు అంద శేషత్వమ్ నిలైనిల్లామైయాలే, తత్సిద్ధ్యర్థమాక తత్ప్రసంబంధికళాయ్, పరమశేషికళాన ఎంబెరు మానరభిమాననిష్ఠర్ విషయత్తిలుమ్, త్రివిధకరణత్తాలుమ్ కించిత్కరిత్తు ప్పోరుమ్ నిలైయిలే ఒరుప్పడ ప్పణ్ణుకై.**

(2) స్వరూపనిష్ఠఅంటే- ఇష్టవినియోగార్హస్వరూపమైన తదీయశేషత్వం **"అకించిత్కరస్య శేషత్వానుపపత్తిః"** (కైంకర్యం చేయనివానికి శేషత్వం నిలువదు)

అనే రీతిలో కించిత్కారం లేపుడు ఆ శేషత్వం స్థిరంగా నిలువదు కనుక, ఆ శేషత్వ సిద్ధికోసం, ఆశేషత్వానికి ప్రతిసంబంధులై, పరమశేషి భూతులైన భగవద్రామానుజుల అభిమానంలో ఒదిగి ఉండేవారి విషయంలో త్రికరణాత్మకంగా కైంకర్యం చేసే స్థితిలో తత్పరతో కైంకర్యాన్ని చేయడం.

**స్వరూపయాథాత్మ్యజ్ఞానమావతు - ఎమ్బెరుమానారుడైయ అభిమానత్తిలొతుఙ్గి, తద్విషయకించిత్కారత్తాలే నిలైయై యుడైయ శ్రీవైష్ణవర్కళ్‌పక్కల్ అవ్యభిచారిణియాన భక్తియై ప్పణ్ణి, తద్విషయవిషయీకారత్తిలే స్వస్వరూపత్తై చ్చొరుకియిట్టు, ఇన్ద స్వరూప మత్తలైక్కే యురుప్పాయ్ వినియోగ ప్పడవేణుమెన్ఱు మివ్వర్థత్తినుడైయ నిత్యప్రార్థనైయిలే నిలైయుడైయ నాయిరుక్కు మిరుప్పై యుళ్ళపడి యఱికై. "ఉన్ తొణ్డర్కట్కే యన్బుత్ఱిరుక్కుమ్బడి ఎన్నై యాక్కి యఙ్గాళ్‌పడుత్తే" (ఇరామానుశ-107) ఎన్ఱు - అముతనారు మివ్వర్థత్తై అరుళిచ్చెయ్‌తారిఱే.**

(3) స్వరూపయాథాత్మ్యజ్ఞానమంటే- భగవద్రామానుజుల అభిమానంలో ఒదిగి ఉండి, వారి కైంకర్యంవల్ల సత్తను పొందే శ్రీవైష్ణవులపట్ల అవ్యభిచారిణి అయిన భక్తిని కల్గి ఉండి, వారి అనుగ్రహంవల్ల స్వస్వరూపాన్ని కల్గి ఉండి, ఆ స్వరూపం వారికే వినయోగపడాలి -అనే నిత్యప్రార్థనవల్ల సత్తను పొందే తమ స్థితిని యథాతథంగా తెలియడం. ఈ స్థితినిగూర్చి అముదనార్ ఇరామానుశనూఱ్ఱన్దాదిలో **"ఉన్ తొణ్డర్కట్కే అన్బుత్ఱిరుక్కుమ్బడి ఎన్నై యాక్కి అఙ్గాళ్‌పడుత్తే"** (మీదాసులపట్ల ప్రేమను కలవాడనుగా నన్ను చేసి, వారికి నన్ను శేషభూతునిగా చేశారు) అని పలికారు కదా!

**స్వరూపయాథాత్మ్య నిష్ఠైయావతు - చరమపర్వమాన ఎమ్బెరుమానారుడైయ ముఖవికాసత్తుక్కుడలాక తదీయవిషయకించిత్కారత్తాలుమ్, తన్ముఖవికాస హేతువాన తచ్ఛేషవిషయకించిత్కారత్తాలుమ్, స్వరూపత్తై వినియోగార్హ మామ్బడి తత్తత్ ఛందానువర్తనపూర్వకమాక అశేష శేషవృత్తియిలు మన్వయిప్పిత్తు, అతుతాన్, తత్తద్విషయభూతరాన శ్రీవైష్ణవర్కళుడైయ పరంపరాపర్యంతమాక త్రివిధ**



**కరణత్తాలుమ్ పర్యవసిక్కుమ్బడి పణ్ణి, తద్విషయకించిత్కారాభావత్తిల్, ఆత్మసత్తై యిల్లై యెన్ఱుమ్బడియాన నిలై పిఱన్దు, తదేకనిష్ఠైయిలే తత్పరనాయిరుక్కై.**

స్వరూపయాథాత్మ్యనిష్ఠ అంటే -చరమపర్వమైన భగవద్రామానుజుల ముఖవికాసానికి తగినట్లు తదీయ (వారి భక్తుల) విషయంలో కైంకర్యంవల్ల స్వరూపాన్ని వినియోగార్హం అయేటట్లుగా చేసి, తత్తత్ ఛందానువర్తన పూర్వకంగా (ఆయా భక్తుల ఇష్టానుసారంగా వర్తించడంద్వారా) అశేషమైన కైంకర్యంలో అన్వయింపజేసి, ఆ కైంకర్యం అంతటితో ఆగకుండా, ఆయా రామానుజభక్తుల అనుగ్రహానికి విషయభూతులైన శ్రీవైష్ణవుల పరంపరా పర్యంతంగా త్రివిధకరణాలతో పర్యవసించేటట్లు చేసి, వారికి కైంకర్యం చేయలేకపోతే తమ సత్త లేదు- అనే రీతిలోని స్థితి కల్గి, తదేకనిష్ఠలో తత్పరతను కల్గి ఉండడం.

**ఇని, ఇవ్వర్థనిష్ఠైతాన్ ఓరొరువర్క్కు, చరమశేషియాన ఎమ్బెరుమానారుడైయరు కటాక్షవిశేషత్తాలే లభిక్కు మతొழிయ, మఱ్ఱపడి దుర్లభమాయ్‌ఱ్ఱు. ఆకైయాలే యిఱే నమ్‌దర్శనత్తిల్ చరమశేషియాన ఎమ్బెరుమానార్ విషయత్తిల్ ప్రావణ్యమ్ సార్వత్రికమన్ఱిక్కే, తేడిప్పిడిక్కవేణ్డుమ్బడి క్వాచిత్కమాయిరుక్కిఱతు.**

ఇటువంటి నిష్ఠ అయితే, చరమశేషి అయిన భగవద్రామానుజుల కటాక్షవిశేషంవల్ల లభిస్తుంది తప్ప వేఱు రీతిలో దుర్లభం. అందువల్లనే కదా మన సిద్ధాంతంలో చరమశేషి అయిన భగవద్రామానుజులపట్ల ప్రావణ్యం సార్వత్రికంగా కాకుండా, అన్వేషించి గమనించవలసినట్లుగా క్వాచిత్కమై (ఎక్కడో ఒక్కచోట) ఉన్నది.

**అస్మిన్నర్థే హి విశ్వాస స్సర్వేషాం న జనిష్యతి ।**
**మత్కటాక్షో భవేద్యస్మిన్ మయ్యేవ ప్రవణో హి యః ।**
**తస్య తస్య హృదిస్థోఽయం భవిష్యతి న సంశయః ॥**

**ఎన్ను ఎమ్బెరుమాన్ తానే చరమపర్వవిషయమాన ప్రతిపత్తి తత్కటాక్ష మడియాక ఉండాక వేణుమెన్ను శొల్లివైత్తానితే.**

ఈ విషయంలో విశ్వాసం అందటికి కలుగదుకదా! నా కటాక్షం ఎవరిపై పడుతుందో, నా పట్ల ప్రావణ్యాన్ని ఎవడు కల్గి ఉంటాడో- అతని హృదయగతమై ఈ విశ్వాసం ఉంటుంది. ఇందులో సందేహం లేదు -

అని భగవానుడే చరమపర్వవిషయంలోని విశ్వాసం, తన కటాక్షమూలంగా కల్గుతుందని పలికాడుకదా!

**ఉజ్జీవనేచ్ఛువాన అధికారి, తనక్కు ప్రథమత్తిలే, చరమపర్వమాన ఎమ్బెరు మానార్ విషయత్తిల్ ప్రావణ్యమ్ విళైకైక్కుడలాక, తదభిమాననిష్ఠరాన శ్రీవైష్ణవర్కళ్ పక్కల్ కరణత్రయత్తాలుమ్ అనువర్తనమ్ పణ్ణి, తదవసరప్రతీక్షనాయ్, తనక్క వర్కళ్ స్వరూపశోధనమ్ కొడుత్తు తన్నై విరుంబిమేల్ విழுన్దు, తద్గుణ వైభవత్తై ఉపదేశిక్క, శుక్కాన్ పఱల్ పోలే కఠినహృదయనన్ఱిక్కే నెఞ్జీరక్క ముడైయనాయ్, చ్చెవి తాழ்த்తు కణ్ణుమ్ కణ్ణీరు మాయిరుక్కుడియాన పరిపాకదశై పిఱన్దాల్, చరమశేషికటాక్షమ్ పిఱన్దు తడైయిన్ఱియిలే ఇవన్పక్కల్ ప్రవహిక్కుమ్. పిన్బు తత్సంబంధ మవిచ్ఛిన్నస్రోతోరూపేణ నడన్దుశెల్లుమితే.**

స్వోజ్జీవనేచ్ఛను కల అధికారి, తనకు మొదట, చరమపర్వమైన భగవద్రామానుజుల విషయంలో ప్రావణ్యం కల్గడానికి తగినట్లుగా, వారి అభిమానంలో ఒదిగి ఉండే శ్రీవైష్ణవులపట్ల త్రికరణాత్మకంగా అనువర్తనం చేసి, వారి కైంకర్యంకోసం ఎదురు చూచేవాడై ఉండాలి. వారు తన స్వరూపాన్ని శోధించి, తనను ఆదరించి అభిమానించి, ఆశ్రీరామానుజుల వైభవాన్ని ఉపదేశించగా, సున్నపురాయివలె కఠినమైన హృదయం కల్గినవాడు కాకుండా ఉండాలి. మనస్సులో ఆర్ద్రతను కలవాడై, వారి సూక్తులను చెవి ఒగ్గివిని, వాటిని ఆలకించినపుడు ఆనందంతో, ఆర్తితో కన్నీరు మున్నీరై ఉండే పరిపక్వదశ కల్గితే, చరమశేషి అయిన శ్రీరామానుజుల కటాక్షం కలిగి, ఏ అడ్డులేకుండా



ఇతనిపై ప్రవహిస్తుంది. ఆ తరువాత తత్సంబంధం అవిచ్ఛిన్నప్రవాహరూపంలో అనువర్తిస్తుంది.

**ఇప్పడిప్పట్ట సంబంధత్తై ఇవనుక్కువర్కళ్ ఉణర్త్తుమ్పోతు, ఇవన్ అఱియాద తాయ్, ఎమ్బెరు మానారుమ్ తదీయరుమఱిన్దతాయిరుప్పన శిల కైముతల్ ఇవన్ పక్కలుండా యిరుక్కవేణుమితే. అవైయావన - నిరఙ్కు శస్వతంత్రనాయ్, నిరుపాధికశేషియాన ఎంబెరుమాన్ ఇవ్వధికారియినిడత్తిలే నన్మైయై నినైక్కుమ్బడి యాన కుళిర్న్ద తిరువుళ్లత్తై యుడైయనాకవేణుమ్. అతుక్కు అడియాక ఇవనుక్కు అజ్ఞాతమాయ్, అవనుక్కు, జ్ఞాతమాయిరుప్పతొరు యాదృచ్ఛికసుకృతమ్ పిఱన్దిరుక్క వేణుమ్. ఇవన్పక్కలి లేదేనుమ్ యాదృచ్ఛికమాక ఒరు నన్మై కాణుంపోతు ఎన్ఱో? - ఎన్ను ఎఙ్గు మొక్కవ్యాప్తిపణ్ణి అవకాశమ్ పార్త్తిరుక్కుమ్ సర్వేశ్వరనుడైయ కటాక్ష విశేష మివన్పక్కల్ అభిముఖ మాయిరుక్కవేణుమ్. ఇప్పడి ఎంబెరుమానుడైయ విశేషకటాక్ష మభిముఖమాన దశైయిలే, భగవత్ప్రసంగమ్ వన్దాల్ శివిట్కొన్ను ద్వేషమ్ కొండాడామల్, అనుమతి ప్రదనాయిరుక్కవేణుమ్. ఇతడియాక భగవద్గుణ విగ్రహవిభూతిదర్శనత్తిల్ ముఖమ్ మాఱాడామల్, అభిముఖనా యిరుక్కుమ్బడి యాన నినైవు పిఱక్క వేణుమ్. ఇతుక్కెల్లా మడియాక ఇవై ఇత్తనైయుమ్ పెற்ற భగవత్స్వరూపరూప గుణవిభూతివిషయ జ్ఞానత్తైయుడైయరాయ్, నిష్కృష్టసత్త్వ గుణనిష్ఠరాన శ్రీవైష్ణవర్కళోడు సంబంధత్తుక్కు పూర్వభావియాన సంభాషణ ముండాకవేణుమ్. ఇవై ఇత్తనైయు ముండాకిలితే, ఇవనుక్కు సదాచార్యరాయ్, చరమపర్వమాన ఎంబెరుమానారోడు సంబంధమ్ సిద్ధిప్పతు.**

ఇటువంటి సంబంధాన్ని ఇతనికి వారు (శ్రీవైష్ణవులు) తెలియ జెప్పేటపుడు- ఇతడు తెలియనివి, భగవద్రామానుజులు, తదీయులు తెలిసినవి అయిన ఏవో కొన్ని సుకృతాలు ఇతనిదగ్గరకు ఉండాలి కదా! అవి ఏవి? అంటే, నిరంకుశస్వతంత్రుడై, నిరుపాధిక శేషి అయిన శ్రియఃపతి, ఈ అధికారి దగ్గర

సుకృత మున్నదని తలచే రీతిలో చల్లని హృదయాన్ని కలవాడై ఉండాలి. దానికి మూలంగా ఇతనికి (జీవునకు) అజ్ఞాతమై, అతనికి (భగవంతునకు) జ్ఞాతమైన "ఏదో ఒక యాదృచ్ఛిక సుకృతం కల్గి ఉండాలి) ఇతని దగ్గర ఏదైన ఒక యాదృచ్ఛికంగా ఒక సుకృతాన్ని చూచినపుడు, అంతటా వ్యాపించి అవకాశం కోసం చూచే భగవంతుని కటాక్షవిశేషం ఇతనిపై అభిముఖమై ఉండాలి. ఈ రీతిలో భగవానుని విశేషణ కటాక్షం అభిముఖమైన దశలో భగవానుని ప్రసక్తి వస్తే కోపించి ద్వేషం చూపకుండా, అనుమతించేవాడై ఉండాలి. దీని మూలంగా భగవద్గుణ విగ్రహవిభూతుల దర్శనంలో ముఖం మారకుండా, ఆభిముఖ్యాన్ని కల్గి ఉండే భావన ఉండాలి. దీనికంతటికి మూలంగా వీనిని అన్నిటిని పొంది, భగవత్స్వరూపరూపగుణవిభూతుల జ్ఞానాన్ని కలవారై, నిష్కృష్టమైన సత్త్వగుణాన్ని కల శ్రీవైష్ణవులతో సంబంధం కల్గడానికి కారణమైన (పూర్వభావి అయిన) సంభాషణం ఉండాలి. ఇవి అన్నీ ఉన్నపుడు కదా, ఇతనికి సదాచార్యులై, చరమపర్వమైన శ్రీరామానుజులతో సంబంధం సిద్ధిస్తుంది.

**"ఈశ్వరస్య చ సౌహార్దం యదృచ్ఛాసుకృతం తథా ।**
**విష్ణోః ప్రసాదాదద్వేష మాభిముఖ్యం చ సాత్వికైః ।**
**సంభాషణం షడేతాని హ్యాచార్యప్రాప్తి హేతవః ॥**

**ఎన్జితే యితుక్కు ప్రమాణమ్.**

(ఈ శ్లోకం ఈ ప్రబంధానికి నాయకరత్నంవంటిది. ఆచార్యప్రాప్తికోసం భగవానుడు చేసే కృషిపరంపరలను ఈ శ్లోకాలు తెలుపుతున్నందున చరమోపాయవైభవాన్నిగూర్చి ఇంతకుమించి చెప్పదగిన అంశం ఏదీ లేదు. ఆశ్రయణసౌకర్యాపాదకాలైన వాత్సల్యం, స్వామిత్వం, సౌశీల్యం, సౌలభ్యం- అనే గుణాలు. నాల్గు, ఆశ్రితకార్యాపాదకాలైన జ్ఞానం, శక్తి -అనే గుణాలు రెండు, ఈ విధంగా భగవత్ప్రాప్తికి ఆఱు గుణాలవలె ఆచార్యప్రాప్తికి కూడా ఆఱు గుణాలు ఈ శ్లోకంలో చెప్పబడ్డాయి. ఆ గుణాలతో ఈ గుణాలకు ఉండే సాధర్మ్యం గ్రంథవిస్తృతివల్ల తెలుపబడలేదు.)



సర్వనియంత అయిన ఈశ్వరుని సౌహార్దం- అంటే చేతనుని విషయంలో హితాన్ని భావించడానికి హేతువైన మంచి హృదయం కల్గి ఉండడం- ఒక హేతువు. (ఇక్కడ ఈశ్వరపదం ద్వారా **"మత్తః స్మృతిః జ్ఞాన మపోహనం చ"**- నావల్లనే స్మృతి, జ్ఞానం, విస్మృతి అన్నీ కల్గుతాయి- అని కర్మానుగుణంగా బంధమోక్షాలు రెండిటికి బాధ్యుడై ఉండే స్థితి తెలుపబడింది. **'చ'** అనే అవ్యయ- ఇటువంటి వానికి సౌహార్దం కల్గడం అరుదు- అనే అతిశంకను తెలుపుతున్నది. నిరంకుశస్వాతంత్ర్యంతో ఇతనిని సంసారహేతువైన నిగ్రహశక్తికి లక్ష్యంగా చేసి, **"క్షిపామి"** అని ప్రక్కకు గెంటివేయడాన్ని చూస్తే, భగవానునకు సౌహార్దమనేది ఉన్నదా ? అని సందేహించవలసినట్లుగా కదా ఉంటుంది. ఇక, సౌహార్దమనే పదం నిరుపాధిక స్నేహాన్ని తెల్పుతుంది. పితాపుత్రసంబంధంతో స్నేహం నిరుపాధికంగానే ఉంటుంది. **"క్షిపామి"** అనేది కూడా పితృత్వప్రయుక్తమైన హితపరత్వంవల్లనే.)

ఈ విధంగా నిరుపాధికస్నేహయుక్తుడైన భగవానుడు జీవునిపట్ల హితాన్ని భావించే రీతి ఇకపై తెలుపబడుతున్నది. యదృచ్ఛాసుకృతం అంటే- "నా భక్తులు దాహాన్ని తీర్చావు, నా భక్తులు విశ్రాంతి తీసికొనడానికి తగిన చోటును ఇచ్చావు"- అని ఈరీతిలో భగవానుడే కన్పించే యాదృచ్ఛిక సుకృతమని అర్థం. ఆ విధంగా భగవానుని సౌహార్దంవల్ల యదృచ్ఛాసుకృతం కలిగేటట్లే, సర్వవ్యాపకుడైన భగవానుని అనుగ్రహంవల్ల భగవత్ప్రసంగం జరిగినపుడు ద్వేషం లేకపోవడం, భగవద్గుణ విగ్రహాదులపట్ల ఆభిముఖ్యాన్ని కల్గి ఉండడం- అనే ఈ రెండు ఇనుమును బంగారంగా చేసే **"వేదకప్పొన్"** (పరుసవేది) వంటి పరమసాత్త్విక జనులతో సంభాషణం- అనే ఈ ఆఱు ఆచార్యప్రాప్తికి కారణాలు అవుతున్నాయి.

(ఇక్కడ **"విష్ణోః"** అనే పదం అంతటా వ్యాపించి ఉండే స్థితిని తెల్పుతున్నందున, నిరుపాధిక (సహజ) స్నేహంతో కూడినవాడైన భగవానుడు చేతనుని విషయంలో యదృచ్ఛాసుకృతం లభించే సమయం ఎపుడా ? అని

అవకాశాన్ని ఎదురు చూచేవాడై ఉండడం తెలుపుతున్నది. **"తథా"** అనే అవ్యయపదం, **"ప్రసాదాత్"** అనే పంచమీవిభక్తిని చివర కల్గిన పదం - అనే ఈ రెండు నిరుపాధిక స్నేహంతో యదృచ్ఛాసుకృతాన్ని అన్వేషించి గమనించినట్లు, కృపతో అద్వేషాభిముఖ్యాదులు కల్గించిన రీతిని తెలుపుతున్నాయి. అద్వేషానికి, ఆభిముఖ్యానికి కారణం భగవదనుగ్రహమే తప్ప, యదృచ్ఛాసుకృతం కాదనే విషయం శ్రీవచనభూషణ దివ్యశాస్త్రంలో స్పష్టం. భగవదనుగ్రహానికి యదృచ్ఛాసుకృతం కారణంకావడం కూడా భగవానునకు వైషమ్యనైర్ఘృణ్యాలు రాకుండా పోవడంకోసమే. లేకపోతే, సౌహార్దంతో భగవదనుగ్రహం, దానివల్ల యదృచ్ఛాసుకృతం కలుగవచ్చు. అద్వేషపదం కూడా శమదమాదులైన సమస్తాత్మగుణాలకు ఉపలక్షణం- **"ఆచార్యలాభమ్ ఆత్మగుణత్తాలే"** అని చెప్పబడిందికదా! అద్వేషం, ఆభిముఖ్యంకూడా భగవత్కృపవల్లనే సిద్ధిస్తాయని తెలుపబడినందున **"ఆచార్యలాభమ్ భగవానాలే"** -ఆచార్యుడు దొరకడం భగవానునివల్లనే- అనే చరమసూక్త్యర్థం సూచింప బడింది. **"సాత్త్వికైః సంభాషణమ్"** అనే చోట సాత్త్వికజనుల జన్మవృత్తాదులను పురస్కరించుకొని పలుకనందున (నిర్విశేషంగా పల్కినందున), సంభాషణమంటే సమ్యక్ భాషణమైనందున, సాత్త్వికజనుల జన్మవృత్తాదులను గనించకుండా, వారి జ్ఞానవిశేషాన్ని మాత్రమే చూచి, **"తొழுమి నీర్ కొడుమిన్ కొళ్మిన్"** అనే రీతిలో పరమసాత్త్వికులతో కలసి ఇచ్చి పుచ్చుకొనే వర్తించే రీతి తెలుపబడింది. **"షడేతాని"** అని అన్నందున ఆచార్యప్రాప్తికి ఇవి అన్నీ ఆవశ్యకాలని తెలుపబడింది. అవి ఏవి ? అంటే- (1) కర్మమూలంగా **"క్షిపామి"** అనే భగవానుని నిగ్రహం మాటి, నిరుపాధిక స్నేహం కలగాలి, (2) తన్మూలంగా యాదృచ్ఛాసుకృతమనేది ఒకటి కలగాలి, (3) సర్వముక్తి ప్రసంగం రాకుండా ఉండడంకోసం ఈ యదృచ్ఛాసుకృతాన్ని హేతువుగా గ్రహించి భగవత్కృప కలగాలి, (4) అందువల్ల అద్వేషం, (5) దానిని అనుసరించి వచ్చే ఆభిముఖ్యం కలగాలి, (6) ఆ పిమ్మట ఆచార్యసమాశ్రయణానికి ప్రధానంగా అపేక్షితమైన భాగవతులతో సంభాషణమనే సంబంధం కలగాలి. ఈవిధంగా



ఇవి అన్నీ ఆవశ్యకాలని తెలుపబడింది. **"ఆచార్యప్రాప్తిహేతవః"** అనే ప్రయోగంలోని ఆచార్యపదం **"ఆచినోతి హి శాస్త్రార్థాన్"** ఇత్యాదిగా చెప్పబడిన రీతిలో **"ఞాన మనుట్టాన మివై నన్గాకవే యుడైయనాన"**- (జ్ఞానానుష్ఠానాలను చక్కగా కల్గిన)- ఆచార్యుని తెల్పుతున్నది. **"ప్రాప్తి"** అని అన్నందున ఇటువంటి ఆచార్యుడు లభించడం అలభ్యలాభం అని తెలుపబడింది. ఈశ్వరుని గమనిస్తే -సౌహార్దం కల్గడమే అరుదు- అనే రీతిలో ఉన్నందున, చేతనుని చూస్తే- అద్వేషంతో పాటుగా భగవత్కృపవల్ల కలుగవలసిన రీతిలో **"అసూయా ప్రసవభూః"** (అసూయకు ఉత్పత్తిస్థానం)గా ఉన్నందున, కర్మలను గమనిస్తే- ఒక్కొక్కటి **"బ్రహ్మకల్పనియుతానుభవేఽప్యనాశ్యమ్"** (పలు బ్రహ్మకల్పాల తరబడి అనుభవించినా తీరనివి) గా ఉన్నందున, అద్వేషపదంతో సూచింపబడిన మిగిలిన ఆత్మగుణాలను చూస్తే అవి మనచేత ఇతరులచేత, కల్గించుకోవడానికి సాధ్యం కానివిగా ఉన్నందున, ఆచార్యలాభం అలభ్యలాభంగానే ఉంటుంది.

**ఇని, ఎంబెరుమానారుడైయ అభిమానత్తిలే ఒదుఙ్గి వర్తిక్కుమ్ చరమాధి కారియాన శ్రీవైష్ణవనుక్కు వస్తవ్యభూమియావతు - "ఇరామానుశనైత్తొழுమ్ పెరియోర్ ఎழுన్దిరైత్తాడు మిడమ్ అడియేనుక్కిరుప్పిడమ్" (ఇరామానుశ-105) ఎన్నైయాలే, ఎంబెరు మానార్ తిరువడికళిల్ ప్రావణ్యముడైయారాయ్, పెరియమతిప్పరాయ్, తత్సంబంధ వైలక్షణ్యాభివృద్ధి యుండాక ప్పెన్ఱో మెన్గిఱ హర్షప్రకర్షత్తాలే ససంభ్రమనృత్తమ్ పణ్ణి వర్తిక్కిఱ సాత్విక శ్రీవైష్ణవర్కళ్ ఎழுన్దరుళియిరుక్కుమ్ పరమపావనమానదేశమ్.**

ఇక, భగవద్రామానుజుల అభిమానంలో ఒదిగి వర్తించే చరమాధికారి అయిన శ్రీవైష్ణవునకు వస్తవ్యభూమి ఏది? అంటే, **"ఇరామానుశనైత్తొழுమ్పెరియోర్ ఎழுన్దిరైత్తాడుమిడమ్ అడియేనుక్కు ఇరుప్పిడమే"** -(భగవద్రామానుజులను సేవించే పెద్దలు వేంచేసి ఉండే చోటు దాసునకు వస్తవ్యభూమి) అని అన్నందున భగవద్రామానుజుల శ్రీచరణాలలో ప్రావణ్యాన్ని

కల్గినవార్రై, గొప్ప వైభవాన్ని కలవార్రై, తత్సంబంధ వైలక్షణ్యాభివృద్ధిని పొందాము కదా!- అనే హర్షప్రకర్షవల్ల ససంభ్రమనర్తనం చేసే సాత్త్విక శ్రీవైష్ణవులు వేంచేసి ఉండే పరమ పావనమైన దేశం.

**"అస్మద్దేశిక భగవద్రామానుజయోగిచరణయుగళ మాశ్రితానాం, తదభిమానై కనిష్ఠానాం, తద్గుణ సందోహానుభవానందామృతసాగరతరంగ శీకరసంబంధ శీతలహృదయానాం, తదీయదివ్యనామోచ్చారణ జనితహర్షప్రకర్షవశాత్స సంభ్రమ నర్తనం కుర్వతాం, సాత్వికాగ్రేసరాణాం, శమదమాదిగుణోపేతానాం, తత్త్వవిత్తమానా, మస్మత్స్వామినా, మాంధ్రపూర్ణగోవిందార్యతుల్యస్వభావానా ముపాదేయత మదివ్యజ్ఞానభక్తివైరాగ్యనిష్ఠానాం శ్రీవైష్ణవానా మావాసస్థాన మేవాస్మదాది చరమాధికారిణామప్యావాసభూమిః" ఎన్ఱు నాయనారాచ్చాన్ పిళ్లై యరుళిచ్చెయ్‌తారిఱే.**

ఇది నాయనార్ ఆచ్చాన్‌పిళ్ళై అనుగ్రహించిన సూక్తి.

మనకు ఉజ్జీవనాన్ని కల్గించే, సమస్తకల్యాణగుణాలను, పరిపూర్ణజ్ఞానాన్ని కల, "అవై తన్నొడుమ్ వన్దిరుప్పిడమ్ మాయన్ ఇరామానుశన్ మనత్తు" (దివ్యదేశాలతో పాటుగా వచ్చి భగవానుడు వేంచేసి ఉండే చోటు- శ్రీరామానుజుల హృదయం) అనే రీతిలో సర్వేశ్వరుడు విభూతులతోపాటు తమ హృదయంలో వేంచేసి ఉండే యోగనిష్ఠను కల శ్రీరామానుజుల రెండు శ్రీచరణాలను ఉపాయంగా, ఉపేయంగా ఆశ్రయించినవార్రై, ఆ శ్రీరామానుజుల అభిమానంలోనే స్థిరంగా ఒదిగి ఉండేవార్రై, "శెమ్మైనూల్ పులవర్క్కు ఎణ్ణరుమ్ కీర్త్తి" అనే రీతిలో గొప్ప జ్ఞానాన్ని కల కవిపండితులకు సైతం ఇదమిత్థంగా పరిచ్ఛేదించి తెలియడానికి సాధ్యం కాని వారి కల్యాణగుణసమూహంయొక్క అనుభవంవల్ల కల్గిన ఆనందమనే అమృతసాగరంలోని అలల తుంపురుల యొక్క నిత్యసంశ్లేషంతో చల్లనైన హృదయాలను కలవార్రై, వారి దివ్యనామమైన, "చతురా చతురక్షరీ" అని అభియుక్తులచే హార్దంగా ప్రశంసింపబడే రామానుజనామంయొక్క ఉచ్చారణ వల్ల కల్గిన ఆనందాతిరేకంతో మనస్సులోని ప్రీతి లోపల ఇముడనందున పారవశ్యంతో నర్తనం చేసేవార్రై, పరమసాత్త్వికులలో



ఉత్కృష్టులై, శమం, దమం మొదలైన ఆత్మగుణాలను కలవార్రై, పరాపరతత్త్వయాథాత్మ్య జ్ఞానాన్ని కల్గినవారిలో శ్రేష్ఠులై, మావంటివారికి ప్రాప్తశేషిభూతులై, వడుగనంబి, ఎమ్బార్ వంటి ఆచార్యనిష్ఠను కలవార్రై, **"మూవరిలుమ్ వైత్తుకొణ్డు మికవుమ్ వేణ్డువదు ప్రపన్ననుక్కు"** అనే రీతిలో మిక్కిలిగా ఆవశ్యకమైన **"తామరైయాళ్‌కేళ్వన్ ఒరువనైయే నోక్కు ముణర్వు"** అని పల్కిన రీతిలో శ్రియఃపతిని విషయంగా కల్గిన జ్ఞానం, పర్వక్రమంలో పరమభక్తి పర్యంతం పర్యవసించే భక్తి, **"ప్రపన్ననుక్కు విహితవిషయ నివృత్తి తన్నేఱ్ఱమ్"** అని పొగడబడిన వైరాగ్యవిశేషం- అనే వీటిలో స్థిరమైన నిష్ఠను కలవార్రై ఉండే **"ఇరామానుశనై త్తొழுమ్ పెరియోర్"** అని కీర్తింపబడే మహాత్ములు నివసించే, **'ఎழுన్దిరైత్తాడుమిడమ్"** (ససంభ్రమనర్తనం చేసే చోటు) అనే స్థానమే- దాసునివంటి, "స్వాభిమానంతో ఈశ్వరుని అభిమానాన్ని పోగొట్టుకొన్నందున గతి లేనివార్రై, చేష్టలుడిగి, **"త్వత్పాదభక్త ఇవ శిష్టజనౌఘమధ్యే మిథ్యా చరామి"** -దేవరవారి శ్రీచరణభక్తునివలె మహాత్ముల సమూహం మధ్యలో అసత్యంగా వర్తిస్తున్నాను'' అనే అనుసంధానానికి తగిన పంచమోపాయనిష్ఠులకు **"దేశోఽయం సర్వకామధుక్"** అనే రీతిలో అనిష్టనివృత్తికి, ఇష్టప్రాప్తికి హేతువై వస్తవ్యభూమియై ఉన్నది)

(ఈ సూక్తిలోని **"దివ్యజ్ఞాన భక్తి"** ఇత్యాది సందర్భంలో గల **"దివ్య"** అనే విశేషణాన్ని జ్ఞానభక్తి వైరాగ్యాలకు మూడిటికి అన్వయించాలి. అందువల్ల జ్ఞానాదుల నిష్కృష్టమైన రూపం తెలుపబడుతుంది. యోగరహస్యం కురుకైకావలప్పన్ అనే పూర్వాచార్యులతోనే అంతరించిపోయినా, **"యోగినా మపి సర్వేషాం మద్గతేనాంతరాత్మనా, శ్రద్ధావాన్ భజతే యో మాం స మే యుక్తతమో మతః"** అనే రీతిలో **"ఉణర్న్ద మెయ్ ఞానియర్ యోగమ్ తొఱుమ్"** అనే ఇరామానుశనూఱ్ఱన్దాది పాశురంలో చెప్పబడిన నిరతిశయమైన ప్రేమ ఇక్కడ యోగనిష్ఠగా చెప్పబడింది. ఇదే **"నిత్యయుక్తః, ఏకభక్తిః"** అని, **"జ్ఞానీ త్వాత్మైవ"** అని సర్వేశ్వరుడే నోరు తెరచి కీర్తించే రీతిలోని గొప్పతనాన్ని కల్గినది)

**ఇని, ఇంద చరమాధికారిక్కు పరిహరిక్కవేణ్డు మంశజ్గళ్ శిల ఉణ్డు. అవైయావన - పరమకారుణికరాన ఎంబెరుమానారుడైయ గుణానుసంధానశ్రవణత్తిల్ శివిట్కెన్ఱు నెఞ్జెరక్కమఱ్ఱిరుక్కుమ్ దుర్మానికళుడన్ సంభాషణముమ్, అవర్కళుడన్ సహవాసముమ్, అవర్కళుడన్ కూడి భుజిక్కుమతువుమ్, తత్పాదతీర్థముమ్, పాణిపక్వాన్నభోజనముమ్, శరీరసంబంధప్రయుక్తమాక అవర్కళుడన్ బాంధవాసక్తి యుండాకైయుమ్, తత్కృతభగవద్గుణానుసంధాన శ్రవణముమ్, తత్తదీయసత్కార ముమ్, తద్దత్తద్రవ్యస్వీకారముమ్, తద్విషయప్రణామముమ్, ఆక - ఇంద పత్తు కృత్యముమ్ చరమపర్వమాన ఎంబెరుమానార్ విషయత్తిల్ మఱువఱ్ఱ ప్రావణ్యముడైయునాయ్, తదభిమానత్తిలే ఒతుఙ్గి వర్తిక్కుమ్ ఉత్తమాధికారిక్కు విశేషిత్తు పరిహరిక్కవేణుమ్. ఇల్లైయాకిల్, ఒరుతలై ద్వంద్వభక్తియు మొరుతలై విఴుప్పుమాయ్ పోరుమివనుక్కు ఉభయసంబంధముమ్ కులైన్దు, యావదాత్మ భావి సంసారమను వర్తిక్కు మతొழియ కరై కాణ్గిఅదిల్లై.**

ఇక, ఈ చరమాధికారి విడువవలసిన విషయాలు కొన్ని ఉన్నాయి- అవి ఏవి? అంటే - (1) పరమకారుణికులైన భగవద్రామానుజుల గుణానుసంధానాన్ని విన్నపుడు కోపించి, మనస్సులో ఆర్ద్రతను లేని దురహంకారులతో సంభాషణం, (2) వారితో సహవాసం, (3) వారితో కూడి భుజించడం, (4) వారి శ్రీపాదతీర్థాన్ని స్వీకరించడం, (5) వారి చేతులతో వండిన అన్నాన్ని భుజించడం, (6) వారితో శరీరసంబంధాన్ని కల్గి ఉండడంద్వారా వారితో బాంధవాసక్తిని పొందడం, (7) వారు చేసే భగవద్గుణానుసంధానం, (8) వారు, వారికి చెందినవారు చేసే సత్కారం, (9) వారిచ్చిన ద్రవ్యాన్ని స్వీకరించడం, (10) వారికి ప్రణమిల్లడం- అనేవి. ఈ పది కృత్యాలను చరమపర్వరూపులైన భగవద్రామానుజుల విషయంలో నిష్కళంక ప్రావణ్యాన్ని కలవారై, వారి అభిమానంలో ఒదిగిఉండే ఉత్తమాధికారి విశేషించి విడచిపెట్టాలి. లేకపోతే, ఒకవైపు ద్వంద్వభక్తి, ఇంకొకవైపు మాలిన్యం కల్గినవాడైన వానికి ఉభయసంబంధం (భగవత్ సంబంధం, రామానుజసంబంధం) నశించి, యావదాత్మభావిగా సంసారం అనువర్తిస్తుంది తప్ప, తీరాన్ని చేరలేడు.



**శ్రియఃపతియాయ్, పరమదయాళువాయ్, పరమశేషియాయ్, సర్వశక్తియుక్త నాన ఎంబెరుమానుడైయ తిరువడికళై ఉపాయమాక పఱ్ఱి, తద్గుణ ప్రతిపాదకదివ్యప్రబంధఙ్గళై అనుసంధానత్తుక్కు విషయమాక్కి, "పొழுతెనక్కు మఱ్ఱదు ఎప్పోతు". ఎన్గిఅపడియే పోతుపోక్కి వర్తిక్కిఱ నమక్కు, "పేఱ్ఱిల్ కణ్ణழிవుండో?" ఎన్ఱు నినైత్తు, చరమ పర్వత్తిల్ ఇరంగామల్, దురభిమాని కళాయిరుక్కుమ్ కழுణిమిండరాన శ్రీవైష్ణవర్కళ్, అవర్కళ్తఙ్గళ్ తఙ్గళ్ నినైవాలే పేఱుణ్డు ఎన్ఱిరుక్కిలుమ్, ఈశ్వరన్ సర్వజ్ఞనాకైయాలే, చరమపర్వమాన ఎంబెరుమానార్పక్కల్ కణ్వైయా మెన్ఱిరున్ద అతువే హేతువాక అవర్కళుక్కు ప్పేఱ్ఱై ప్పణ్ణిక్కొడాతమాత్రమే యన్ఱియే, ఇవర్కళ్ స్వరూపత్తైయుమ్ కాలక్రమత్తిలే సంకుచితమామ్బడి పణ్ణివిడువన్.**

శ్రియఃపతియై, పరమదయాళువై, పరమశేషియై, సర్వశక్తిని కలవాడైన భగవానుని శ్రీచరణాలను ఉపాయంగా ఆశ్రయించి, తద్గుణప్రతిపాదకాలైన దివ్యప్రబంధాలను అనుసంధానానికి విషయంగా చేసికొని, **"పొழுదెనక్కు మఱ్ఱదు ఎప్పోదు"** అనే రీతిలో కాలక్షేపం చేసే మనకు ప్రాప్యసిద్ధిలో లోటు ఉన్నదా ?- అని తలచి, చరమపర్వంలో ప్రవేశించకుండా, దురభిమానులై ఉండే మూర్ఖులైన శ్రీవైష్ణవులు, వారు తమ భావనలో ప్రాప్యసిద్ధి కల్గుతుందని తలచినా, భగవానుడు సర్వజ్ఞుడైనందున చరమపర్వమైన భగవద్రామానుజుల పట్ల దృష్టిని పెట్టడు- అని తలచి ఉండడమే కారణంగా తలచి వారికి ప్రాప్యసిద్ధిని కల్గించకపోవడమే కాక, వీరి స్వరూపాన్నికూడా కాలక్రమంలో సంకుచితం అయేటట్లు చేస్తాడు.

**శ్రీశశ్రీమత్పదాబ్జే శరణమితి ధియా తత్ర భక్తిత్వరాణాం**
**శ్రీమద్రామానుజార్యప్రణతి మభజతాం గూఢచిత్తాశయానామ్।**
**కారుణ్యక్షాంతి సింధు స్స్వపద నివసతిం నేశ్వరో దాతుమిచ్ఛేత్**
**ఇదిత్యేవం చింతకానా మపి పరమపదం దాతు కామ స్స జాతు ॥**

**ఎన్ఱు ఎంబార్ అరుళిచ్చెయ్త ఇంద దివ్యసూక్తి, ఉక్తమాన అర్థత్తుక్కు ప్రమాణమాక అనుసంధేయమాకక్కడవతు.**

ఈవిషయంలో ఎమ్బార్ పల్కిన ఈ క్రిందిసూక్తి ప్రమాణంగా అనుసంధేయం.

శ్రియఃపతియొక్క **"పిరాట్టియుమ్, అవనుమ్ విడిలుమ్ తిరువడికళ్ విడాదు"** - లక్ష్మీదేవి, భగవంతుడు విడచిపెట్టిన శ్రీచరణాలు భక్తులను విడువవు- అనే గొప్పతనాన్ని కల్గిన శ్రీచరణాలు రెండే ఇతర నిరపేక్షోపాయం -అనే బుద్ధితో ఆ శ్రీచరణాలలో "స్నేహ పూర్వ మనుధ్యానం భక్తిః"- (స్నేహపూర్వకమైన నిరంతర ధ్యానమే భక్తి) అనే ప్రీతిపూర్వకమైన స్మరణంలో అధికాధికమైన అభినివేశమనే త్వరను కలవారై, ఆ శ్రియఃపతియొక్క శ్రీచరణస్వరూపులే- అనే రీతిలోని నిరవధికసంపదను కలవారైన భగవద్రామానుజుల శ్రీచరణాలు చేయదగిన శరణాగతిని చేయనివారై, ఈవిధంగా శ్రీరామానుజులను ఉపేక్షించే తమ అంతరంగాభిప్రాయాన్ని బయటకు వ్యక్తం చేయకుండా, తమను భగవద్రామానుజ దర్శనంలో నిష్ఠను కలవారని ఇతరులు భావించేటట్లు వంచిస్తూ వర్తించేవారికి -అద్వేషంనుండి ఆచార్యప్రాప్తివరకు అనుగ్రహించడానికి తగిన కృపాగుణానికి **"తన్నడియార్"** అనే పాశురంలో పల్కిన రీతిలో **"ఎన్నడియార్ అదు శెయ్యార్"** నా దాసులు తప్పు చేయరు- అని అనడానికి తగిన క్షమాగుణానికి సముద్రంవంటివాడైన సర్వేశ్వరుడు తన రాజధాని అయిన పరమపదాన్ని ఇవ్వడానికి ఇష్టపడడు. ఇంతమాత్రమే కాక, ఈ రీతిలోనే, "భగవద్రామానుజుల శ్రీచరణాలను ఆశ్రయించము"- అని మనస్సులో తలచే వారికి కూడా ఎప్పటికీ పరమపదాన్ని ఇవ్వాలనే మనస్సును కలవాడు కాడు.

(ఇక్కడ **"న భవేత్"** అని క్రియ యొక్క ఔచిత్యాన్నిబట్టి అధ్యాహరించుకోవడంద్వారా కాలక్రమంలో వీరి సామాన్యజ్ఞానంకూడా మలినమయేటట్లు చేసి, స్వరూపాన్ని సంకుచితం అయేటట్లు చేస్తాడనే భావం స్ఫురిస్తుంది. మొదటి



పాదం చివరలో **"తత్ప్రపత్తి త్వరాణామ్"** అనే పాఠాంతరానికి -ఆ శ్రీచరణాలలో చేయదగిన శరణవరణ రూపమైన ప్రపత్తిలో త్వరను కలవారై- అని అర్థం. ఈ పక్షంలో త్వర, సాధనాంతరాలలోని దోషదర్శనంవల్ల, సంసారంలో కాలు నిలువనందువల్ల కల్గుతుందని గ్రహించాలి.)

ఇన్నముమ్, "రామానుజపదచ్ఛాయై" ఎన్ఱు పుక*ఝ్* పె*ఱ్ఱ* ఇవర్, **"శ్రీమన్నారాయణ చరణారవిందశరణాగతిరేవోజ్జీవనాయ భవతీతి బుద్ధ్యా, భగవంతం పరమకారుణికం, పరమోదార, మపారకల్యాణగుణాకర, మపరిమితవాత్సల్య సౌశీల్యసాగర, మశరణ్యాఖిలజనశరణ్య, మనవరతమాశ్రయ ణీయచరణ కమల యుగళ, మభిమతానురూపనిరవధికానందసందోహజనకనిత్యసూరిపరిషదంతర్భావ మహాఫలప్రసాదక, మస్మదుత్తారక, మతిరమణీయ విమలతర లావణ్యాకరదివ్య మంగళవిగ్రహమతిశీతలవిమల గంభీర జలాశయప్రభవ మిహిరతరుణకిరణని కరవికసిత విరాజమానకమల దళాయతదివ్యనయనయుగళం, స్వవశగమితచిదచి దీశ్వరతత్త్వత్రయ సూచకదండత్రయరూపమండనమండిత, మస్మన్మాతర, మస్మత్పితర మమృతలహరీవదనుకూలనవ్యదివ్యకోమలవిమల మధునాయమాణ నిజసూక్తికలాపై రాశ్రితా నఖిలజనా నాహ్లాదయంతం, శ్రీమంత, మార్యజనాభివంద్య, మస్మత్కులనాథ, మస్మదసాధారణశేషిణ, మస్మదాదిరక్ష్యవర్గ సర్వప్రకారరక్షణైక దీక్షాగురుం, శ్రీరామానుజాచార్యానాదృత్య,**

ఇంతేకాక **"రామానుజ పదచ్ఛాయా"** అనే కీర్తిని పొందిన ఈ ఎమ్బార్ పల్కిన ఇంకొక సూక్తి ఇక్కడ ఉదాహరింపబడుతున్నది.

శ్రియఃపతి అయిన సర్వేశ్వరుని శ్రీచరణ పద్మాలలో చేసే ప్రపత్తియే ఉజ్జీవనానికి కారణమనే ("వ్యవసాయాత్మికా బుద్ధిః" అనే రీతిలోని) జ్ఞానవిశేషంతో- పరిపూర్ణజ్ఞానాన్ని కలవారై, బంధమోక్షాలు రెండిటికి సాధారణుడైన ఈశ్వరుని కంటే గొప్ప కరుణను కలవారై, (తమ అభిమానంలో ఒదిగి ఉండేవారికి ప్రాప్యసిద్ధిని కల్గించాలి - అని వాదులాడడంవల్ల) ఇంతకు

మించినది లేదు- అనే రీతిలోని ఔదార్యాన్ని కలవారై, అపారమైన కల్యాణ గుణాలకు వాసస్థానమై, వాటిలో, వాత్సల్య సౌశీల్యాలు అపరిమితాలుగా ఉన్నందున, వాటికి సముద్రం వంటివారై, మంచి అనే పేరు పెట్టదగిన ఏ దోషాన్ని అయినా చూడలేక, సర్వేశ్వరుడు చేయి విడచినందున గత్యంతరం లేని సమస్తచేతనులకు సైతం రక్షకులై, **"అత్ర పరత్ర చాపి"** (ఇక్కడ, పరమపదంలోను) అనే రీతిలో సంసారంలోను, ప్రాప్యభూమి అయిన నిత్యవిభూతిలోను ఆశ్రయించదగిన శ్రీచరణాలను కలవారై, స్వరూపజ్ఞానాన్ని కలవారికి అభిమతమై, అనురూపమై ఉండే ఎల్లలేని ఆనందంయొక్క సమూహానికి ఉత్తరోత్తరాభివృద్ధిని కల్గించే నిత్యసూరుల గోష్ఠిలో కలసి ఉండడమనే సర్వోత్తమమైన ఫలాన్ని అనుగ్రహించేవారై, దాసునకు (నావంటివారికి) ఉత్తారకులై (ముందుగా పెరియనంబి తమను - అంటే ఎమ్బార్‌ను) అనుగ్రహించడానికికూడా శ్రీరామానుజులు కారణమైనందున, ఆ పెరియనంబికూడా ఉపాయోపేయాలు రెండు శ్రీరామానుజుల శ్రీచరణాలే- అని తమకు చూపినందున, **"అస్మదుత్తారకమ్"** అని అన్నారు), అత్యంతం భోగ్యమై, (జ్ఞాన పరిమళం అంతా విగ్రహంలో స్ఫురించి అనుభవించేటట్లుగా) మిక్కిలి నిర్మలమై, (భగవద్గుణానుభవంవల్ల అత్యంతానందాన్ని పొందినందున తిరుమేనిలో అంతటా నిండిన) కాంతిప్రవాహానికి నివాసస్థానమై, (**"తిరుమాలిరుమ్ శోలైమలై"** అనే పాశురక్రమంలో భగవానుడు ఆదరించినందున) అప్రాకృతమై, విలక్షణమై ఉండే తిరుమేనిని కలవారై, చాలా చల్లనివై, స్వచ్ఛమై గాంభీర్యం (లోతు) ఇంతటిది అని తెలియరానిదై ఉండే జలాశయంలో పుట్టినవి, బాలసూర్యుని కిరణాలతో వికసింపజేయబడినవి, వికాసం మాఱకుండా ప్రకాశించే తామరపూలరేకులవలె ఆకర్ణాంతం విస్తరించిన దివ్యనయనాలను కలవారై, (ఇక్కడ **"నయన"**శబ్దం- జ్ఞానవాచి కనుక, అది శ్రియఃపతిని విషయంగా కల్గినది కనుక, రెండుగా ఉన్నందున ఉభయ వేదాంతవిషయజ్ఞానాన్ని సూచిస్తుంది.) తమకు వశం చేయబడిన చిదచిదీశ్వర తత్త్వత్రయానికి సూచకమైన, త్రిదండరూపమైన అలంకారంతో



అలంకరింపబడినవారై, దాసునకు ప్రియాన్ని నిర్వహించేవారైనందున తల్లివంటివారై, హితాన్ని నిర్వహిస్తున్నందున తండ్రివంటివారై, అమృత ప్రవాహంలోని అలలవలె చెవులకు తీయని సూక్తులై, అపూర్వాలై, **"కేట్టారార్ వానవర్కళ్"** అని అన్నందున దివ్యులైన సూరులకు ఆలకించడానికి తగినవై, మృదువైన శైలిలో కూడినవై, నిర్దుష్టాలై, **"తేనుమ్ పాలుమ్ కన్నలుమ్"** వలె ఉండే శ్రీభాష్యం మొదలైన తమ సూక్తుల పరంపరలతో తమను ఆశ్రయించిన వారిని అందఱిని ఆనందపరచేవారై, **"సంసేవితః సంయమి సప్తశత్యాపీఠై శ్చతుస్సప్తభిః సమేతః"** - ఏడు వందలమంది యతులతో, 74 మంది సింహాసనాధిపతులతో సేవింపబడేవారు - ఇత్యాదిగా చెప్పబడిన రీతిలో శిష్యులయొక్క నిరవధికమైన సంపదను కలవారై, ఆర్యులైన నాథయామున ప్రభృతి పూర్వాచార్యులచే పొగడబడినవారై, మన ప్రపన్నకులానికి నాథులై, దాసునకు ప్రాప్తశేషియై, దాసుడు మొదలైన రక్ష్యభూతుల వర్గాన్ని అన్నిరీతులలో రక్షించడమనే ముఖ్యమైన దీక్షను కలవారై, ఆచార్యులై ఉండే భగవద్రామానుజాచార్యులవారిని అనాదరించి-

**పరమకారుణికః భగవానేవ స్వచరణకమలసమాశ్రితానా మస్మాకం స్వప్రాప్తిరూపఫలం ప్రయచ్ఛతీతి స్వమతేన విచిన్త్య వర్తమానానాం, తత్త్వజ్ఞానలవలేశ దేశాతిగానాం దురభిమాన సహకృతపరభ్రామకవృత్తానాం రూపవేషధారిణాం వయమేవ శ్రీవైష్ణవా ఇతి స్వమతే నాత్మానం బహుమన్యమానానాం చేతనానాం,**

సృష్టి చేయడం అవతారాలను ఎత్తడం మొదలైన వాటిని చేయడం ద్వారా ప్రారంభంనుండి చేతనోద్ధరణంకోసం కృషిచేస్తూ ఉన్నందున తనకు మించిన కారుణికులు వేఱొకరు లేనివాడైన, ఆశ్రయణసౌకర్యాపాదకగుణాలు, ఆశ్రితకార్యాపాకగుణాలు- అనే వీనిలో ఏ తేడా లేకుండా సమస్తకల్యాణ గుణాలతో పరిపూర్ణుడైన సర్వేశ్వరుడే స్వయంగా **"తన్నై వణఙ్గవైత్త కరణమివై"-** (తనను సేవించడంకోసం సృష్టించిన కరణాలు ఇవి) అని వారు అర్థించి పొందనక్కరలేకుండా తానే ఇచ్చిన తన శ్రీచరణపద్మాలను ఆశ్రయించే మనకు

తన ప్రాప్తి- అనే పరమపురుషార్థాన్ని ఇస్తాడు- అని, శ్రీరామానుజ సంబంధం అక్కరలేదనే అహంకార దూషితమైన తమ అభిప్రాయంతో ఆలోచించి, ఆ నమ్మకంనుండి చలించకుండా వర్తించేవారై, వేదాంతజ్ఞానంలోని అత్యల్పభాగం వర్తించే దేశాన్ని అతిక్రమించి (అంటే - అజ్ఞానమాత్రమే కాకుండా, తత్త్వజ్ఞానమనేది ఒకటి ఉన్నదని తెలిసినవారుండే నివసించే ప్రదేశాన్ని కూడా తెలియకుండా ఉండేవారై) ("పరంజ్యోతి రుపసంపద్య" ఇత్యాది రీతిలో ఆవిర్భూతస్వరూపుడైన ప్రకాశించిన స్వరూపాన్ని కల ఆత్మకు భగవచ్ఛేషత్వమే స్వరూపమై, ఆ శేషత్వస్వరూపం తదీయపర్యంతంగా కొనసాగితే తప్ప స్థిరంగా నిలువదు - అనే ఇదే వేదాంతజ్ఞానంలోని తాత్పర్యం. ఆ తదీయుల - భగవద్భక్తుల ఆనందంకోసం ఆచార్యశేషత్వం రాగప్రాప్తంగా తనకుతానే వస్తుంది కనుక, ఆచార్యత్వపూర్తి ఉండే శ్రీరామానుజులను ఆనాదరించిన వారి తత్త్వజ్ఞానం అసత్కల్పంగానే ఉంటుందని భావం), ఈవిధంగా తత్త్వయాథాత్మ్య జ్ఞానగంధమే లేకుండా ఉన్నా, దురహంకార పూరితులై, తమను ఇతరులు చూస్తే "కుంపటిలో తామరపూచినట్లుగా ఈ సంసారంలో ఇటువంటివారున్నారే! ఎంత ఆశ్చర్యం!'' అని భ్రమపడే రీతిలో పరమసాత్త్వికుల అనుష్ఠానాన్ని అభినయించేవారై, "అకృత్రిమత్వచ్చరణారవింద ప్రేమ" సహజమైన, నీ చరణారవిందాలలోని ప్రేమ -అనే సూక్తికి సాక్షాత్తు విరుద్ధంగా కృత్రిమమైన శ్రీవైష్ణవరూప వేషాలను కలవారై, "మేమే వైష్ణవాగ్రేసరుల''మనే అహంకార గ్రస్తమైన తమ అభిప్రాయంతో తమను తాము గొప్పగా భావించేవారై ఉండే చేతనులకు (వీరిని అచేతనులని చెప్పవలసి ఉండగా, తద్విరుద్ధంగా 'చేతన" శబ్దంతో నిర్దేశించడం ఎటువంటిది? అంటే- అమంగళవారాన్ని మంగళవారం అనేటట్లు వ్యతిరేక నిర్దేశమే.)

**అపారకారుణ్యౌదార్య వాత్సల్యసౌశీల్యైక నిధిరపి భగవాన్ పురుషోత్తమః శ్రీమన్నారాయణః, అస్మత్కుల స్వామినో భగవతః శ్రీమద్రామానుజగురోః చరణ యుగళసంబంధరాహిత్యం హృది నిధాయ, కదాచిదపి స్వప్రాప్తిరూప మోక్షఫలమ**



**కుర్వాణః, యావదాత్మభావి సంసారనిరయగర్తే, "క్షిపామ్యజస్రమ్" (గీత) ఇతివదన్ నిక్షిప్య, కదాచిదపి, తాన్ హృదా న గణయతి. రామానుజగురు కృపాభిమానంతర్భూత సాత్త్వికజనేషు నిత్యదత్తదృష్టిః, తేభ్య స్సర్వ స్వదానకరణేఽపి కిమపి న దత్తమేవేత్య ద్యాప్యపరితుష్టః, రామానుజగురుచరణ యుగళ ప్రావణ్యానైరంతర్యప్రదానైకనిష్ఠాతో వర్తతే" - ఎన్ఱు, ఎమ్బెరుమానారోడు సంబంధమిల్లాతవర్కళుక్కు, సర్వ ప్రకారత్తాలమ్ మీశ్వరన్ స్వప్రాప్తి పణ్ణిక్కొడామల్, యావదాత్మభావి సంసారమాకిఱ నరకక్కు ష్ఠియిలే తళ్లి యిట్టువైత్తు, తిరువుళ్ల త్తాలు మవర్కళై నినైయాన్ - ఎన్ఱరుళిచ్చెయ్ తారితే.**

అఖిలహేయప్రత్యనీకుడు, "యస్మాత్ క్షరమతీతోఽహ మక్షరాదపి చోత్తమః, అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః" అనే రీతిలో క్షరశబ్దంతో నిర్దేశింపబడే బద్ధచేతనులు, అక్షరశబ్దంలో నిర్దేశింపబడే చేతనులు- అనే వీరికంటే విలక్షణుడైనందున పురుషోత్తముడనే ప్రసిద్ధిని పొందిన శ్రీమన్నారాయణుడు, అంతులేని "**కృపా కాఽప్యుపజాయతే**" అనే రీతిలో సంసారుల ఉజ్జీవనానికి హేతువైన కరుణ, "**శేరుమ్ కొడై**" అని పొగడబడే ఔదార్యం, దోషభోగ్యత్వరూపమైన వాత్సల్యం, తన గొప్పతనాన్ని చూడకుండా తక్కువవారితో ఏ తేడాలేకుండా కలిసే స్వభావమనే సౌశీల్యం- అనే వీటికి అద్వితీయ నివాసస్థానమై ఉన్నా, "**నః కులపతేః**" అనే రీతిలో ప్రపన్నకులనాథులై, మన ఉజ్జీవనానికి ఆవశ్యకమైన సమస్తకల్యాణగుణాలను, పరిపూర్ణజ్ఞానాన్ని కలవారై, "**ఆచార్యపదమెన్ఱు తనియే ఒరు పదముణ్డు, అతుళ్ళదు ఎమ్బెరుమానార్క్కే**" -ఆచార్యపదమని ఒక ప్రత్యేకమైన స్థానం ఉన్నది, అది భగవద్రామానుజులకే ఉన్నది- అనేరీతిలో స్థిరమైన ఆచార్యపద సంపదను కలవారైన శ్రీరామానుజుల శ్రీచరణాలు రెండిటితో ఆశ్రయణరూప సంబంధం లేకపోవడాన్ని తన మనస్సులో పెట్టుకొని, ఏనాటికీ తన ప్రాప్తి అనే మోక్షాన్ని అనుగ్రహించడు. నిత్యంగా సంసారమనే నరకకూపంలో "**క్షిపామ్యజస్రమ్**" నరకంలోకి నిరంతరం తోసివేస్తాను- అని పల్కుతూ, (**"అహంకారం బలం**